# "సీతాపహరణము."

(నాటకము.)



గ్రంథకర్త:

వీరమతీ, చండనృపాల, రాణాప్రతాపసింహచరిత్ర, సమగ్ర రామాయణనాటక
పద్మావతీవిజయ విలయమాధుర్యాది గ్రంథకర్తలునగు
"కవిసింహ, అవధానిపంచానన, కావ్యకళానిధి" బిరుదాంకితులు
దుర్భాక రాజశేఖర శతావధానిగారు,
ప్రొద్దటూరు.




ప్రథమ ముద్రణము. 500 ప్రతులు.

శ్రీకన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

1934.



సర్వస్వామ్యసంకలితము]


[వెల 0-8-0

శ్రీ

# సీతాపహరణము.



ప్రథమాంకము—పంచవటమునఁ బర్ణశాల.

ప్రవేశము—సీతా, రాములు.

రా: గీ॥ చండమార్తాండుఁ డగ్నివర్షంబుగురియు। మండువేసవి నొకయింత యెండ కాన
రాక మందానిల ప్రసారమ్ము గలిగి। గౌతమీతీరసీమ సౌఖ్యములఁ గూర్చు.

సీత: అవును. పంచవటము మనకెంతయు సౌఖ్యదాయకమై యున్నది. జనుల సందడిలేక శాంతియుతమైన యిట్టి ప్రదేశములు పరమశ్రేష్ఠములనికదా తపోధనులగు మునీంద్రు లిట్టి ప్రదేశముల నాశ్రమము లేర్పఱతురు.

రా: జానకీ! యగస్త్యాశ్రమమువిడిచి యీపంచవటమునకు వచ్చినదిమొదలు మనము మునివృత్తి నవలంబించి యున్నాముగదా!

మ॥ ఫలముల్ మెక్కుచు గౌతమీజలముల్ బానంబుగావించుచున్
జలువల్ చిమ్మెడు కమ్మతెమ్మెరలు మేనన్ సోఁకి యుత్సాహమున్
బలమున్ గూర్పఁగ శాంతవృత్తిని వనావాసంబునన్ దాపసే
శుల చందంబునఁ గాలమున్ గడుపమే శుభ్రాంశుబింబాననా!

సీ: దేవా! గంగాతీరముదాఁటి పంచవటముఁ జేరుదనుక మార్గమున మనము చూడఁ దటస్థించిన తాపసులు మనల నెన్నివిధముల సత్కరించిరి! ఆ మునీంద్రుల యాశ్రమముల నిలిచిన యాదినములుగూడ మిక్కిలి యుత్సాహవంతములే!

రా: అవును. ఆతాపసులందఱుదారదయానిధులు. పరమపుణ్యరాసులగు వారికి మనయెడ మిక్కిలి వాత్సల్యము. వారిని సేవించుట నాకును బ్రీతిదాయకము.

సీ: అవును. మునిపత్నుల సేవించువేళలలో నేను మైమఱచు చుందును. ముఖ్యముగా ననసూయా లోపాముద్రలకడ నున్నపుడు దినములు నిమిషములవలెఁ గడచుచుండెడివి.

రా: సీతా! మహామహిమగలదని యనసూయాదేవి నీకుఁ గుంకుమ నొసంగియుండెనే. నీవద్దాని నేమిచేసితివి! ఎందేనిఁబెట్టి మఱవలేదుకదా!

సీ: భద్రపఱచి యుంచుకొని యిప్పటికి నుపయోగించుకొను చున్నాను. ఆమహాజనని యాతఱి ప్రేమతో నిచ్చిన వస్తువు నెందైన మఱచివత్తునా?

రా: మఱచిరావు. కాని యాదినము మనపైఁ గవిసిన రాక్షసునివలని భయమున నొందైనఁ బడవైచియుందు వనుకొంటిని.

సీ: మీరన్నది యేరాక్షసునిగుఱించి!

రా: అత్రిమునియుండు నాశ్రమముదాటి యొకనాఁడు నీవును నేనును సౌమిత్రియు వచ్చు చుండఁగా నొక భయంకర రాక్షసుఁడువచ్చి నిన్నెత్తికొని పరుగెత్తఁ జొచ్చెనే వాఁడు. సీతా! నీ వప్పు డెంత భయపడితివి!

సీ: నన్నెత్తికొని పరుగెత్తినప్పుడు నేనంతగ భయపడలేదు. కాని, పిదప నీవు వానిపై బాణములు వేయఁగా నారాక్షసుఁడు నన్నుఁ గ్రిందికి దించి నిన్నును సౌమిత్రి నెత్తికొనెనే యప్పుడు మాత్రము మిక్కిలి భయపడితిని.

రా: సీతా! యారాక్షసుని భుజములపై గూర్చుండి నేనును లక్ష్మణుఁడు నెట్లుంటిమి?

సీ: వర్ణనమొనరించుటలో నాకు సామర్థ్యము చాలదక్కట. కాని

గీ॥ భయదగాత్రుఁ డాతని భుజద్వయమునందుఁ। గూరుచుండి యొప్పితిరప్డు మీరిరువురు
వరుసఁ బ్రాక్పశ్చిమాద్రులపైన నిలిచి। వెలుఁగుచుండెడు సూర్యచంద్రుల విధాన.

రా: దేవీ! మా యిరువురను గుఱించి చెప్పితివి. ఇఁక నీవిషయమై చెప్పెద వినుము.

గీ॥ మిగులనల్లని మేనున మెఱయు దనుజు। మూఁపుపైఁ గూరుచున్నప్డు బోదలితీవు
కలువకంటిరో! యంజనాచలముపైన। మెఱయుచుండెడు క్రొక్కారు మెఱుఁగుఁబోలె

సీ: అవ్వేళ నీవరుదెంచి భవద్బాణవజ్రధారచేఁ బర్వతోన్నతుఁడైన యారాక్షసు నుక్కడంచి నన్ను నీప్రక్కఁ జేర్చికొంటివి.

రా: ప్రచండవాయు పరికంపితమగు మాలతీలత విధమున నాదానవుని వలని భయమునఁ గంపితశరీరవగు నీవు సీతా! నేను సమీపించినతోడనే నను బిగ్గఁ గౌఁగిలించుకొంటివి. (పరిరంభణము నభినయించుచున్నాఁడు.)

సీ: (సిగ్గునఁ దలవాంచి) అదియేమో నాకు జ్ఞప్తిలేదు.

రా: పోనిమ్ము నిన్నప్పుడు తట్టి ధైర్యము బోధించితినే. అదియైన జ్ఞప్తియున్నదా?

సీ: జ్ఞప్తియున్నది. దేవా! యీవనవాస మేవిధమునను గష్టమనిపించదు. కాని రాక్షసుల వలని బాధమాత్రము మిక్కుటము. మార్గమున నీవును సౌమిత్రియు నెందఱు రాక్షసులను దునుమాడలేదు

రా: అవును. మహాపూజ్యమై మునిజనావాసమైన యీగౌతమీతీరకాంతారమున రాక్షసు లుండుట యెంతయు విచారకరము.

## ప్రథమాంకము.

గీ॥ పాలసంద్రంబున విషంబు వెలయునట్లు। తామరకొలంకున మొసళ్లు దనరునట్లు।
మొగలిపొదయందు సర్పముల్ బొదలునట్లు। సీత! యీకానరక్కసుల్ జేరుటరయ.॥

సీ: ఈ కాంతారవాసులగు మునిపుంగవులకు రాక్షసులవలనఁ దీరని బాధ. ఆరాక్షసుల సంహరించుట నీకు మహోత్సాహకారణము. మఱచితి ఎవ్వఁడో యొక రాక్షసుఁడు సౌమిత్రిచే నీదినము నిహతుఁడయి యుండలేదా.

రా: అవును. విద్యుజ్జిహ్వుఁడను దైతేయుని పుత్రుఁడు జంబుకుమారుఁడనువాఁ డొకపొద యందుఁ గూర్చుండి తపం బొనరించుచుండెనఁట. అతని తపమునకై మెచ్చి యింద్రు డొక యుజ్జ్వలమైన చంద్రహాసమును బంపియుండెనఁట. వాఁడద్దానినిఁ గైకొనక తిరస్కరించిన నయ్యది ధళధళత్కాంతుల నీనుచు వాతావరణమున వ్రేలాడుచుండెనఁట. ఈ దినము ఫలములకొఱకై మన లక్ష్మణుఁ డచ్చటికేఁగియుండి యాచంద్రహాసమును దీసికొని యదియెంత వాఁడిగలదోయని చూచు కుతూహలమ్మునఁ గొన్ని కొమ్మలను నఱకుచుండెనఁట. అంత నచ్చటిమునులు కొందఱువచ్చి లక్ష్మణుని బాహుబలముఁ జూడఁగోరి జంబుకుమారుఁడు కూర్చుండిన పొద నొక్క వ్రేటునకుఁ దెగవ్రేయుమని కోరిరఁట. మహాసత్త్వసంపన్నుఁడైన లక్ష్మణుఁ డాపొద నొక్కవ్రేటునకుఁ దెగవ్రేయఁగా దన్మధ్యమునున్న జంబుకుమారుని శిరము తెగి పడినదఁట.

సీ: జపనిష్ఠలోనున్న యొకానొక మునినిఁ జంపితినని సౌమిత్రి యెంత విచారము నొంది యుండునో!

రా: లక్ష్మణుఁ డట్లే తలంచి మిక్కిలి కలఁతనొందెను. కాని యామహామునులు జంబుకుమారుని పూర్వవృత్తము నెఱింగించి యాచంద్రహాసమును లక్ష్మణునే యుంచుకొమ్మనిరఁట.

సీ: అట్లైన నాపొదలోనుండినవాఁడు రాక్షసుఁడని యామునుల కంతకు మున్నె తెలిసి యుండెనా యేమి!

రా: కాదామఱి! తెలిసియే యారాక్షసుఁ డంతము నొందనిమ్మనియే వారట్లు చెప్పి యున్నారు.

సీ: ఫలములకై యీదినము లక్ష్మణుఁ డంతదూర మేల పోయెనో!

రా: ఎంతదూరము! అల్లదె మూఁడుచెట్లగపడుచున్నవి చూడుము. ఆవృక్షములకుఁ గేవలము సమీపముననే యాపొద యుండినది.

సీ: దేవా! నీవిప్పుడుచూపిన యామార్గముదెసఁ జూడుము. ఒకస్త్రీ మనమున్న యీదెసకు వచ్చుచున్నది.

రా: రూపమును బట్టి చూడ నామె మునిపత్నియని తోఁపదు.

సీ: రాక్షసిగ నుండవుగదా!

రా: ఏమో! ఎట్లు చెప్పవచ్చును!

ప్రవేశము—శూర్పనఖ.

గీ॥ కొండవలె భర్త కూలినఁ గొడుకుఁజూచి। ప్రాణముల నెట్టులో మేనఁబట్టియుంటిఁ
గటకటా! నేడుకొడుకు నిష్కారణముగ। జంపి చిచ్చిడినారె నాజఠరమందు.

ఆరాజకుమారు లెప్పుడు కనఁబడుదురు! ఎప్పుడు వారల నాపొట్టలోఁ బెట్టుకొందును! నాపుత్రుని జంబుకుమారునిఁ జంపిన పగ నెప్పుడు తీర్చుకొందును! ఇందెవ్వరో యొక పురుషుఁడును దరుణియు నిలిచియున్నారు. వీరెవ్వరై యుందురు! మునులు చెప్పిన యానవాలుపట్టి చూచిన నీపురుషుఁడు నాకుమారునిఁ జంపిన రాజకుమారులలో నొక్కఁడుగ నుండవచ్చునని తోఁచుచున్నది. ఏది యెట్లున్నను వీరిరువురనుఁ దొలుత మ్రింగివైచెద. (కొంచెము నడచి) ఆహా! యేమి యీపురుషుని లోకమోహనమూర్తి!

సీ॥ సంపూర్ణపూర్ణిమా చంద్రబింబముమించి మురిపెముల్ గులికెయు నెమ్మొమువాఁడు
విరిసిన తెల్ల దామరల చుట్టమ్ములై తళుకారు చారు నేత్రములవాఁడు
నిడుదలై నునుపారి నీలంపుఁగంబము లివి యనఁబోలు బాహువులవాఁడు
నల్లకల్వలకాంతి కొల్ల వెట్టఁగఁజాలు కమనీయకోమలాంగములవాఁడు

గీ॥ చిఱునగవువెన్నెలల్ పయిఁ గులికెయువాఁడు। గలయఁ జల్లని చూపులు జిలుకువాఁడు
ముజ్జగంబులఁగలఁచు కాముండు నేఁడు। వనులకుఁ దపస్వియై యిట్లు వచ్చినాఁడు.

ఇట్టి మనోహరాంగు నేనెట్లు మ్రింగనేర్తును! కడకుఁ బ్రయత్నింపనైన నేర్తునే! ఇట్టి సుందరాకారుని రాజులలో నేనిదివఱకుఁ జూచియెఱుంగను. కడకు సౌందర్య సర్వస్వనిధానులగు మారాక్షసులలోనైన నిట్టివానిని నేఁ జూచినది లేదు. కానిమ్ము. నా కొడుకును జంపిన పగ యట్లుండనిమ్ము. ముందుగ వీని నెట్లైన లోఁబఱచుకొనఁ బ్రయత్నించెద. (అని సమీపించును.)

సీ: ఇది దానవియే. మనయొద్దకే వచ్చుచున్నది.

రా: దేవీ! భయపడకుము. ఆమెతో నొకించుక సేపు వినోదకరముగ మాటాడుదము.

శూ: (రామునిఁ జూచి) ని న్నెచ్చటనో చూచినట్లున్నది.

రా: చాలకాలమునుండి యిచ్చట నున్నాను. గనుక నీయరణ్యమునందే చూచియుందువు.

శూ: నీవెవ్వఁడవు?

మ॥ ఈవనసీమలోనఁ జరియించుచుఁ గన్నుల నిన్నుఁ జూడఁగాఁ
బూవులకోరి చాపమునఁ బూన్చి మనోజుఁడు వేయసాగె; నా
భావము చాలనొచ్చెను; భవత్పరిరంభసుఖంబు నిచ్చి నీ
మోవి గ్రసింపనిచ్చి యొకముద్దుఁ గొనంగ ననుగ్రహింపుమా!

శీఘ్రముగ నాయభీష్టముఁ దీర్పుము. (అని చేయిపట్టుకొనఁ బోవును.)

రా: (ఇంచుక వెనుకకు జరిగి) కామినీ! తొందరపడకుము. కంటికిఁ గానఁబడిన కాంతలనెల్లఁ గవయునంతటి మోహాంధకారము నాకన్నులఁ గప్పలేదు.

శూ: సుందరాంగా! నీకంటికి కెప్పుడును గానఁబడెడి కాంతలలో నేను నొకదానినని భావించితివా! మేలు మేలు. నే నింతదూరము చెప్పినను నాస్వభావమును నీవు చక్కఁగ గ్రహింపనేలేదు.

గీ॥ మానవేశ్వర! యింకఁ బలుమాట లేల! మాయకేళిఁ బెనంగుము; నారసికత,
నావివేకంబు, నాసొగసు, నాబలంబు, నాకులుకు, బెళుకు, నానేర్పు, నీకె తెలియు.

రా: శూర్పణఖా! జగదత్యద్భుతావహమగు రసికతయు విన్నాణమును నీయొద్ద నుండవచ్చును. కాని నేను నిన్నుఁ బరిగ్రహింపఁ జాలను. నాకిదివఱకే యీసీత యొకభార్య యున్నది.

శూ: అయ్యో! నీ కెంతవెఱ్ఱి. సౌభాగ్యమునకుఁ దగిన బుద్ధికుశలత దానియొద్ద లేదే. ఈ కాంతయున్నదని నీవింతగ సంతోషించెదవా!

గీ॥ పరమదుర్లక్షణాంగి యిప్పడతి; నీకు జతకుఁ దగదిది; దీని సద్గుణము పాయు;
మట్లుకాదేని నిపుడె నాకాజ్ఞసిమ్ము; మృత్యుదేవతనై దీని మ్రింగుదాన.

ఇట్టి వికృతరూపిణి నీభార్యయని చెప్పుకొనుటకు నీకు సిగ్గుతోఁచదా! నీవు రామచంద్రుఁడవు. చంద్రునివంటి నీయొద్దఁ గారకమువంటి యీసీత యొక్కటికి నుండఁదగినది కాదు. నేనెట్టి లక్షణవతినో చూడుము; నాముఖము జూడుము. దాని ముఖముఁ జూడుము. నాకన్నులు చూడుము. దానికన్నులు చూడుము. నాయొయ్యారముఁ జూడుము దాని యొయ్యారముఁ జూడుము. ఛీ! దాని కొయ్యారమే లేదే! అయ్యో! దీనిని నీవెట్లు పెండ్లాడితివి!

రా: శూర్పణఖా! నీయెడనుండు సల్లక్షణములలో సహస్రాంశమైన దీనిచెంగట లేవు. అయిన నదియేటికోకాని దీనియెడ నాకు మిక్కిలిప్రేమ గలదు. (సీతను దట్టుచు) ఈ సీతను నాప్రాణపదముగఁ జూచుకొనుచున్నాను. కావున నే నొకమాట చెప్పెద. వినుము.

రా: సీతా! మాసంభాషణ మెట్లుండినది!

సీత: వినోదకరముగ నుండినది. కాని నాథా! యది యెంతగడుసుది! దైత్యస్త్రీలెల్ల నిట్లే యుందురేమో!

రా: ఒక్క దైత్యస్త్రీలే గాదు. మనమనుష్యస్త్రీలు సహితము కొంద ఱిట్లే యుందురు. సుందరీ! స్త్రీలకు సిగ్గును సౌశీల్యమునే యుత్తమభూషణములు. అవిలేని స్త్రీలే రాక్షసులు.

సీ: సిగ్గును సౌశీల్యమును లేని స్త్రీలు స్త్రీలేగారు. నాథా! నేడు మీరాదానవితో నెంత సేపు వేడుకగ మాటాడితిరి! మీరింత వినోదకరముగ మాటాడఁగా నేనెన్నఁడును విని యుండలేదు. మీరిరువురు మాటాడునప్పుడు నాకు నవ్వు వచ్చుచుండెను. ఎట్టులో యణఁచుకొనుచుంటిని.

రా: సీతా! మన్మథప్రేరితయైన యాదానవి కితరప్రసంగము తలకెక్కదు. కావున దాని యిష్టమునకు వచ్చునట్లు నేను మాటాడి మెత్తఁగ నంపివేసితిని.

లక్ష్మణా! లక్ష్మణా (యని దూరమున శూర్పణఖ ప్రవేశించును.)

సీ: శూర్పనఖ సౌమిత్రిని బిలుచుచున్నది. లక్ష్మణుఁ డేమనుకొనునో!

రా: ఏమనుకొనును! వినోదమునకై నేను దానిని బంపితి ననుకొనును.

శూ: లక్ష్మణా!

లక్ష్మ: చిత్తము. (అని తొందరగఁ బ్రవేశించుచున్నాఁడు.)

శూ: నాచిత్తముగాదు. నీచిత్తమని నేను వచ్చియున్నాను.

ల: (ఆలోచన నభినయించుచు స్వగతము) ఎవ్వరీమె! నన్నేటికిఁ బిలుచుచున్నది!

శూ: (సమీపించి) నిన్నిప్పు డెవ్వరు పిలిచినది!

ల: నీ వెవ్వతెవు?

శూ: నేనే నిన్నుఁ బిలిచినది. (అని నవ్వుచున్నది)

ల: నీ విందేల వచ్చితివి!

శూ: మీాయన్న పంపఁగా వచ్చితిని.

ల: నీ వెవ్వతెవు!

శూ: విద్యుజ్జిహ్వుఁడను రాక్షసుని భార్యను. లంకారాజ్యమునేలు రావణుఁడు మాయన్న.

ల: నీపేరు?

శూ: శూర్పనఖ.

ల: (వ్రేలి గోళ్లనుఁ జూచుచు) సార్థకనామమే. చాల ముద్దుగ నున్నది. అయిన నిన్ను

మాయన్న యొద్దకుఁబంపెను.

శూ: నీయొద్దకుఁ బంపెను.

ల: ఎందుకు?

శూ: (నవ్వుచు) నీవు కొంచెము మోటుమానిసివిగఁ గనఁబడుచున్నావు. మాయన్నవలెఁ గుశాగ్రబుద్ధివిగావే! అయిన దృఢగాత్రుఁడవు. నా కదియ కావలసినది.

ల: ఇప్పుడు నాదార్ఢ్యముతో నీ కేమిపని!

శూ: అది పరీక్షించుటకుఁగదా నేనిపుడు వచ్చినది.

ల: యుద్ధముచేయుదువా యేమి!

శూ: విప్పి తేటతెల్లముగఁ జెప్పువఱకును దెలిసికొనునట్లులేవే! ఔను యుద్ధమే. అయిన నిది వేఱొకవిధమైన యుద్ధము. ఇందు నీకుఁ బ్రాణభయము లేదు. కావున భయపడకుము.

ల: నీకును భయములేదు. కొంచెము నిలువుము. (అని ధనువు నెత్తుచున్నాఁడు)

శూ: (చేయి పట్టుకొని) అట్లు గా దట్లు గాదు. నీవు కోపగాఁడవే. అయినను సవరించుకొన వచ్చును. నీదార్ఢ్యమున కీమాత్రము కోపములేకున్న నది రాణింపదు.

ల: ఈయుపన్యాస మట్లుండనిమ్ము. నీకు నాతో నేమికార్యమో శీఘ్రముగఁ జెప్పుము.

శూ: ఇంకను నీ వూహింపనే లేదా!

ల: నా కా యూహాలు గీహాలు తెలియవు. విశదముగఁ జెప్పవలెను. అంతవఱకు నేను తెలిసి కొనఁజాలను.

శూ: అట్లైనఁ గుండఁ బగులఁగొట్టునట్లు చెప్పెదను.

ల: చేయుము. త్వరితముగఁ దెగనిమ్ము. ఆలస్య మొనరింపకుము.

శూ: నేఁగూడఁ దొందరతోనే యున్నాను. ఏమియు లేదు. నీతోఁ జెలిమి యొనర్చి మదనకదనమున సుఖము నొందవలెనని వచ్చియున్నాను. ఏమి! నీకు సమాధానమేనా!

ల: ధన్యోస్మి. దేవతలు నాశిరమునఁ బుష్పవృష్టి గురిసినట్లు. నాజన్మము పావనమయ్యె. నాపితృదేవత లప్పుడే పుణ్యలోకముల కేగియుందురు. అది సరియకాని నీభర్త సజీవుఁడేనా!

శూ: ఛీ! ఛీ! యట్టి పీడ లేమియు లేవు. మెడలోఁ దాళిబొట్టును గాలికి మట్టెలును నొసటఁ గుంకుమఁపుఁబొట్టు నీజంజాటము లేవియు నాకు లేవు.

ల: అట్లయిన శుద్ధముగ విధవవుగదా!

శూ: అట్టి హీనశబ్దము నుపయోగింపకుము. రాక్షసులలో నైదువలనియు విధవలనియు భేదము లేదు. మఱియును ముత్తైదువలకు మగఁ డొక్కఁడే. విధవలకుఁ గోరినవాఁడెల్ల భర్తయే.

ల: సంతోషము. మాయన్న నిన్నెందు కిచ్చటికిఁ బంపెనో చెప్పవైతివే!

శూ: అది యంతయు నీకు నేను చెప్పెదను. కాని ముందు నీవొకదాని కొడంబడవలయును.

ల: దేనికి?

శూ: నాయెడ నీకుఁ బ్రేమ గలదని. న న్నెడఁబాయనని.

ల: ఇంతటి మహాభాగ్యము నెవ్వఁడైనఁ బోఁగొట్టుకొనునా! నీయెడ నపరిమితప్రేమగలదే. నిమిషమా! రెండు నిమిషములా ! ఇంతకాలమునుండి యింతయొద్దికతో నుండువారమే! నీయెడ నాకుఁ బ్రేమ యుండుటకు సందేహించెదవా! మఱియొక విశేషము. జాగ్రద వస్థయందే కాదు. స్వప్నావస్థయందుఁగూడ నీయపూర్వమంగళమూర్తి నాహృదయము నెడఁబాయదు.

శూ: నామనస్సున కిప్పుడు సంతోషము గలుగుచున్నది. ప్రియుఁడా! (అని లక్ష్మణుని భుజముపైఁ జేయివైచి) నీరూప మెంతమనోహరముగ నున్నది!

ల: (చేయి దీసి) కొంచె ముండుము. అన్నగారివిషయ మెఱింగింపుము. పిదప మనవిషయమై మాటాడుకొందము.

శూ: ఎఱింగించెదను. ఇంతకుఁ గొంతముం దీవనమునఁ దిరుగుచు నాపర్ణశాలయొద్దకు వచ్చి మీయన్ననుఁ జూచితిని. లోకమోహనమైన యాతనిరూపముఁ గాంచి నన్నేలుమని ప్రార్థించితిని. తన కొక భార్య యున్నదనియు నన్నుఁ బరిగ్రహించిన నాకు సవతి పోరాటము గలుగుననియుఁ జెప్పి నీయున్న యియ్యెడకుఁ బొమ్మని నన్నుఁ బంపియున్నాఁడు. అందుకై నినుఁ జేరవచ్చితిని. నీవు నన్నుఁ బరిగ్రహించి సుఖమొందుము.

ల: నీవు మిక్కిలి పొరపడితివి. దేవతాచక్రవర్తితో నెనయగు రామచంద్రుని విడిచి యతని క్రీనీడనగు నన్నుఁగోరి నీవిటు వచ్చి యెంతయు బేల వైతివి.

గీ॥ సకలకల్యాణగుణు రామచంద్రు విడిచి। శుద్ధజడుని నన్ గోరి వచ్చుట యుచితమె!
పంచభక్ష్యభోజ్యంబులు పాఱవైచి। నారి! భిక్షాన్న మెవఁడైనఁ గోరువాఁడె!

నెలతా! మఱియొక మాట. రామచంద్రునిఁగూడిన సీతాదేవితో నీకు సవతిపోరు గలుగుననికదా నీవు యోజించుచున్నావు. నన్నుఁబరిగ్రహించిన నీవు మిక్కిలి కష్టపడవలసివచ్చును. ఏటి కందువేని వరుసకు రామచంద్రునకుఁ దమ్ముఁడనైనను సీతా-రాముల

కిరువురకును నేను పరిచర్యలు సేయుచుందును. అట్టిచో నన్నుఁగూడిన నీవును వారిరువుర కుపచారము లొనరింపవలసివచ్చును. నీరూపము నిఖిలభువనసమ్మోహనము. నీవు పరుల సేవింపవలెననిన నామనంబునకే గిట్టకున్నది. కావున నీ వాయనయొద్దకే పొమ్ము.

శూ: నీవు చెప్పినది యోజింపఁదగినదే. నిన్నుఁ బరిగ్రహించుట నాకిష్టమే కాని పరమదుర్లక్షణరాశియగు సీతకుమాత్రము నేను సేవకురాలను గాఁజాలను. అయిన నొకసందేహము. అతఁడు కడు దుర్బలశరీరుఁడని చెప్పితివే. అతనికడ కేగిన నేమిలాభముండును!

ల: ఉండకేమి! విశేషలాభ ముండును. ఉపచారమునకై యట్లనెనేకాని నిశ్చయముగా నమ్మహాత్ముఁ డనంతబలాఢ్యుఁడు.

గీ॥ నిర్జరుల నింద్రుతో నోర్వనేర్చు; నంత। నేల; మీయన్న నారావణేంద్రుఁబట్టి
పదిశిరంబుల నిరువదిబాహువులను। నైనఁ ద్రుంపఁగ నేర్చు మహాభుజుండు.

ఆమహాభాగునిబలమున నొకసహస్రాంశమైన నాయెడ లేదు. అంత యేటికి! ఒకవేళ నీవనుకొనినట్లు నేను బలవంతుఁడనై యతఁడు దుర్బలుఁడయినచో బలవంతుఁడనగు నే నతని నేలసేవించుచుందును! పోనిమ్ము. మీరాక్షసులలో బలవంతులు బలహీనులను గొల్చు మర్యాద యున్నదా!

శూ: ఛీ! యట్టి యపకీర్తిభాజనమగు మర్యాద మారాక్షసులలో మందునకైన లభింపదు. నీవు చెప్పినది సముచితముగ నున్నది. (యోజించి) అట్లయిన నన్నాతఁడు నీసమీపమున కేల పొమ్మనియుండును!

ల: ఇంతమాత్రము తెలిసికొనలేవైతివా! నేను తెలిపెద వినుము. సమీపమున నిలిచి మాటాడునప్పుడు నీసౌందర్యమును జూచి సంతసించియుండును. కాని, నీవొకించుక విలాసముతో నడచునప్పుడు నీసౌందర్యమును నీనడయందమును, నీయొయ్యారమును నీకులుకును జూడలేదుకదా! అవి చూడవలెనని యింతదూర మంపియున్నాఁడు.

శూ: నీవు చెప్పినది నామనస్సునకు సరిపడినది. ఏమో యనుకొంటిని. నీబుద్ధి చాల సూక్ష్మమైనదే! మొట్టమొదటఁ గొంచెము మోటుమానిసివిగఁ గనఁబడితివి. అది యట్లుండనిమ్ము. అతఁడు నన్నంగీకరించి యేలుకొనునా!

ల: నీకుఁ గొంచెము తెలివి తక్కువ. అనఁగా నాలోచన తక్కువయని నాయభిప్రాయము. అపూర్వభువనమోహనమైన నీయాకృతిని జూచిన నెట్టివారికైన మనసు పుట్టకుండునే! రామచంద్రుఁడు నిన్నుఁ జేకొన నంగీకరించుటలో విశేష మేమున్నది! నీవా విషయమై

యోజింపనే వలదు. ఉత్కృష్టశృంగారమును గ్రక్కుచున్న నీముక్కుచెవులయిన నతని మనస్సు నాకర్షింపకపోవు.

శూ: ఇప్పుడు నాసందేహము తీఱినది. నే నిఁక వెళ్లెదను.

ల: సుఖముగఁ బోయిరమ్ము.

శూ: (కొంచెము నడచి మఱల వెనుకకు వచ్చి) లక్ష్మణా! యింకొకఁడు.

ల: ఒకఁడెట్లు! రెండుగదా!

శూ: ఏమిటివి!

ల: ముక్కు—చెవులు.

శూ: ముక్కుఁజెవు లెందుకు! ఏమి నీవు మాటాడునది!

ల: పొరపడితిని. నీముక్కుఁజెవులు మిక్కిలి యందముగ నున్నందున నేను వానినే స్మరించుకొనుచుంటిని.

శూ: (హాసముతో) ఉండ నిమ్ము. నన్ను రాముఁడు పరిగ్రహించిన నిన్నప్పు డప్పుడుఁ జూచుచు, మాటాడుచుండు భాగ్యమైన నాకు లేకపోవునే!

ల: ఇందుచనకే నీకు బుద్ధి చాలఁదక్కువ యనునది.

శూ: తిన్నఁగాఁ జీవాట్లు పెట్ట నారంభించినావే!

ల: చీవాట్లు పెట్టుటగాదు. ఉన్నమాట యంటిని. నీకుఁ గోపమా!

శూ: కోపము! నీమాటలకు నేఁ గోపించుకొందునా! చెప్పుము. నిన్నుఁ జూచుట యెట్లు! మాటాడుట యెట్లు!

ల: నే నిందే యుందునుగదా! నే నెందుఁ బోదునని నీవు విచారించుచున్నావు.

శూ: నేను రామునియొద్దనున్న నీ వీ పర్ణశాలలో నుందువు. నాతో నెట్లు మాటాడెదవు!

ల: చెప్పెదను. ఈదిన మీనిమిషమువఱకు సీతారాము లిరువురే నాకు యజమానులగుటచే సాయంతనమపు డొకగడియసేపు నాకు విశ్రాంతి గలుగుచుండెను. ఇఁకమీఁద నీతోఁగూడ ముప్పురు యజమానులగుదురు. కావున నాగడియసేపు విరామమును లేక పవలు ముప్పదిగడియలు మీయొద్దనే యుందును.

శూ: నాసందేహము తొలఁగినది. నేనిఁక వెళ్లెదను.

ల: వదినే! పోయిరమ్ము.

శూ: అప్పుడే వదినేయని యారంభించినావే!

ల: నీ కేటికి! సంతోషమునఁ బొమ్ము. చక్కని మర్యాద గలుగును.

(శూర్పణఖ వెళ్లుచున్నది. లక్ష్మణుఁడు పర్ణశాలఁ బ్రవేశించును)

సీ: దేవా! యాదానవి మఱల వచ్చుచున్నది.

రా: లక్ష్మణుఁ డేమియో చెప్పి నాయొద్దకుఁ బంపియుండును.

సీ: ఆసుగ్రీవివలె నక్కడకు నిక్కడకుఁ దిరుగలేక పాప మది విసుగు నొందును.

రా: నీవు చూచుచుండుము. నేను మఱల దానిని లక్ష్మణుపాలి కంపెద.

ప్రవేశము:—శూర్పణఖ.

నీవు మిక్కిలి మోసగాఁడవే! నీవంటి బలవంతుఁ డీజగంబున లేఁడని మాలక్ష్మణుఁడు చెప్పెను.

రా: మాలక్ష్మణుఁడు నీరూపముఁ జూచి సంతసింపలేదా!

శూ! సంతసింప కేమి! నాయంగము లన్నియు మనోహరములే కాని, యన్నిఁటికన్న నా ముక్కు సెవులు మఱింత సుందరములని చెప్పినాఁడు. నీవు చూడుము. నీ కెట్లు కనఁ బడునో.

రా: నాకు నట్లే కనఁబడుచున్నవి.

శూ: కావున మఱుమాట వచింపక నన్నేలుకొనుము. నావంటి ధారాళసౌందర్యరాశి తనంత వచ్చి పైఁబడిన గ్రహింపకపోవుట ధర్మము కాదు.

రా: నాకు వీలు లేదని యప్పుడే చెప్పితినే. లక్ష్మణుని గలిసికొనుము.

శూ: అతఁడు నిన్నాశ్రయింపుమని బోధించెను.

రా: ఈమా టాతనియొద్దకుఁ బోయి నిన్నుఁ బరిగ్రహింపుమని నేను గట్టిగాఁ జెప్పితినని వక్కాణింపుము. అతఁడు తప్పక నామాటకు విధేయుఁడగును.

శూ: వలను. నడుమ నూఱక కాలహరణ మగును. ఈమాటలు వదలుము. (రాముని చేయి పట్టుకొని) ఆహా! నీమో మెంత సుందరముగ నున్నది! నిన్నిపుడు బిగ్గఁగౌఁగిలించుకొనెద. (కౌగిలించుకొనఁ బోవును.)

రా: ఛీ! దూర ముండుము. (అప్పుడు సీత నవ్వుచున్నది.)

శూ: నన్నుఁ జూచి నవ్వి యప్పుడే నీసపత్నీలక్షణములఁ జూపుచున్నావా! ఛీ! గయ్యాళీ! నిన్నిప్పుడే మ్రింగి నాసౌఖ్యమున కాటంకములేకుండఁజేసెద. (అని సీతపైఁ గవియుచున్నది.)

రా: హీనదానవీ! నిలువుము. (అని సీత నొకచేతను శూర్పణఖ నొకచేతను బట్టుకొని) లక్ష్మణా!

ల: దేవా! (యని శీఘ్రముగఁ బ్రవేశించుచున్నాఁడు)

రా: గీ॥ లోకచుక్క రోహిణిపయి దొడరివచ్చు। పగిది జానకిపై నెత్తివచ్చి మ్రింగఁ
బూనియుండెఁ; గావున దీని ముక్కుసెవులు।క్రూరకరవాలమునఁ దెగఁగోయవయ్య!

ల: చిత్తము. (శూర్పణఖను బట్టికొని) నే నింతసేపటినుండి కోరుకొనుచుండిన నీముక్కు-సెవులే నాభాగమునకు వచ్చినవి. నాపుణ్యము పండినది. రమ్ము.

శూ: మీ రిద్దఱు మోసగాండ్రుగ నే కనఁబడుచున్నారే!

ల: మూర్ఖప్రసంగము సేయకుము.

శూ: నేను వానియొద్దకుఁ బోనని యప్పుడే చెప్పలేదా!

ల: నీగోము గట్టిపెట్టుము. నాయొద్ద సాగదు. (చేయి గట్టిగాఁ బట్టుకొనును.)

శూ: అబ్బ! యేమి పట్టోయి నీది! ఇనుపపట్టే! కొంచెము వదలుచేయుము. (విడిపించుకొనఁ జూచుచున్నది.)

ల: వదలుచేయుట లేదు. బిట్టుచేయుట లేదు. చక్క నిలువుము.

శూ: నీవు యథార్థముగ ముక్కు-సెవులు గోయుదువాయేమి!

ల: అట్లే చూచుచుండుము. కోయుదునో లేదో!

శూ: నాకొంప దీయునట్లున్నావే! నన్ను విడువుము. నీకు విశేషలాభము గలిగించెదను.

ల: నీవు గల్గించు లాభములన్నియుఁ గొంపోయి గోదావరిలోఁ గలుపుము. ఆలస్యము చేయకుము. సరిగ నిలువుము. లేకున్న నీకుత్తుకఁ గత్తిరించెదను.

శూ: కడకు నన్ను వెట్టిముండను జేసితిరే! మీరిరువురను నమ్మి నేను మోసపోతిని.

ల: దేవుఁడే నిన్ను వెట్టిముండఁగాఁ జేసియున్నాఁడు. సరి. ఇఁక గదలకుము. (ముక్కు-సెవులు గోయును. శూర్పణఖ యేడ్చుచుఁ బోవుచున్నది.)

రా: సౌమిత్రీ! యరసికజనులతోడి సంభాషణము లెప్పుడు ముప్పును దెచ్చుచుండును.

ల: దేవా! సత్యము సెలవిచ్చితిరి.

సీ: నాథా! యాక్రూరదానవి యింతటితో నూఱక పోవునా! దానిసోదరుల మనపైఁ బురికొల్పికొని తీసికొనిరాదా!

రా: ఆమె యూఱకుండునని నేను దలంపను. సౌమిత్రీ! ఈమహాధను వెట్లు మిడుఁగురులఁ జిమ్ముచున్నదో చూడుము. ఒకగొప్పయుద్ధము తటస్థించుననియు నందు నాకు జయము గలుగుననియు నిది సూచించుచున్నది. శూర్పణఖ జనస్థానముననున్న తన సోదరులను మనపైఁ దెచ్చును. కావున రణ మిప్పుడు తప్పదు. సీత కుసుమకోమల. భీరువు. కావున,

చ॥ జనకతనూజ నొక్కయెడ శైలగుహాఁ దగ నిల్పి, నీవు చెం
తనె నిలుచుండి, చాలబలితమ్ముగ నధిజ్యము భీమమౌ మహా
ధనువు ధరించి, రాక్షసవితానముచేత మహీజ కేభయం
బును గలుగంగనీక కడుఁబోడిమి మీఱఁగఁ గాచుచుండుమా.

మనపై రాఁగల రాక్షసుల నందఱ నేను సమయించి వచ్చెద.

ల: దేవా! విన్నప మవధరింపవలెను.

చ॥ అకలుషదివ్యచిత్త! దనుజావళిపైఁ జననేల నీవు! జా
నకికడ నుండు; మేను జని నవ్యమహోగ్రశరాళి దైత్యమ
స్తకములఁ ద్రెళ్లనేసి వసుధాస్థలి నిర్దనుజంబుచేతు; సే
వకునకుగాక నాథునకుఁ బాడియె! యల్పులమీఁది కేగఁగన్!

రా: సౌమిత్రీ! నీవిధేయతకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. (శ్రవణము నభిన యించుచు) అదిగో రాక్షసుల భీకరాట్టహాసములును గర్జనము లిచటికి వినవచ్చు చున్నవి. ఇఁకఁ గాలహరణము చేయరాదు. నీవు సీతను దోడ్కొనిపొమ్ము. సత్వరమ వెళ్లి వచ్చి మిమ్ముఁ గలిసికొనెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ల: తల్లీ! రమ్ము. మనము పోవుదము.

సీ: ఈచెంతనున్న శైలముపైఁగూర్చుండి రామచంద్రుఁ డొనరించు యుద్ధము చూచు చుందము.

ల: అట్లే చేయుదము. (నడచుచు) తల్లీ! నీవిందుఁగూర్చుండుము. నేను ధనుర్ధరుఁడనై కాచియుండెద.

సీ: లక్ష్మణా! చూడుము. రామచంద్రుఁ డప్పుడే రక్షోవీరులపైఁగవిసి బహుళాస్త్రపరం పరలు నిగుడించి వారలఁ జెండాడుచున్నాఁడు.

ల: అమ్మా! మాయన్న దేవతలకుఁగూడ నజేయుఁడు. ముజ్జగము లెత్తివచ్చిన నతఁడు కలఁతనొందఁడు.

సీ: దూరమున మఱియొకసైన్యము వచ్చుచున్నది. అది యెవ్వరిదో!

ల: ఇచ్చట సైన్యమంతయు రామచంద్రునిచే మడియఁగా రాక్షసులు మఱికొంతసైన్యముఁ గొనివచ్చుచున్నారు. మనము చూచుచుండఁగనే యీసైన్యము నేలపా లగును.

సీ: అంపపొదినుండి బాణము దీసికొనుట, మౌర్విని లగించుట, యీడ్చుట, యేయుట యను నీకార్యభేదంబులేర్పడ నెఱుంగరాక చాపము వలయాకారముఁ గొనియుండు టయు రక్షోవీరులు గూలుటయు మాత్రము కనఁబడుచున్నది.

ల: అదుగో! పర్వతోన్నతుఁడయిన యొకరాక్షసుఁడు రామచంద్రునిఁ దాఁకుచున్నాఁడు.

సీ: ఏమి యాశ్చర్యము! రాఘవుని విశిఖధార నాఘోరరాక్షసుఁ డిలపైఁ ద్రెళ్లెను.

ల: దానవసంహార మొనరించి రామచంద్రుఁడు వెనుకకు మఱలుచున్నాఁడు. మనము పోయి యాయనను గలిసికొందము.

సీ: వెళ్లుదము. (ఇరువురు నిష్క్రమించుచున్నారు.)





# సీతాపహరణము.

## ద్వితీయాంకము.



జనస్థానము. శూర్పణఖ ప్రవేశించి.

సీ: అతిప్రేమచేఁ బ్రాణమట్లు పెంచిన ముద్దుకొడుకు జంబుకుమారుఁ గోలుపోతిఁ;
బిదప రూపముఁజూచి ప్రేమించి యింపైన సిగ్గును మానంబుఁ జెఱచుకొంటి;
నంతటితో వెన్క కరుగక కడుసొంపయిన ముక్కుఁజెవులు గోయించుకొంటి;
నదిచాలక మహాబలాఢ్యులు మువ్వురు ప్రియసోదరులను జంపించుకొంటి;

గీ॥ నక్కటా! పాపమతులైన యానృపాల। సుతులచే నేను జచ్చెడి చొప్పు గలిగె;
వారిరక్తముఁ ద్రావి యేపగిది నాదు। కడుపుమంటను జల్లార్పఁగలనొ! నేను.

అకటా! యీ పాపిముండకొడుకులు రామలక్ష్మణులు నా కెట్టి గతి పట్టించిరి! తొలుదొల్త నాగడుసుబోయ లక్ష్మణుఁడు ఫలపుష్పములకని పోయి యొకయెదురుగుమిలోఁ గూర్చుండియుండిన నాపుత్రునిఁ దెగనఱికె. కన్నకడుపగుట శోకించి నాకుమారునిఁ ద్రుంచిన హతకుని ద్రింగెదనని బయలుదేఱితిని. పర్ణశాల దాపునకు వచ్చునప్పటికి దౌర్భాగ్యపుఁజక్రవర్తియగు రాముఁడు మెఱపు మెఱసినట్లు నాకంటఁ బడియె. అదియేమికర్మమో నాకడుపునందలి దుఃఖమంతయు మఱచి నన్నేలుకొమ్మని నేను వానినిఁ బ్రార్థించితిని. తొలుతనే రూపవతినిగనుండి మీఁదుమిక్కిలి భర్త పరలోకగతుఁడైనది మొదలు నిర్భయముగను స్వేచ్ఛతోడను మెలఁగుటఁజేసి మిక్కిలి బలశాలినిగనుండి మహారసికురాలనగు నేను నాయంత దన్ను డాసి యెంతబ్రతిమాలినను వాఁడు నన్ను గ్రహింపకపోయె. తన తమ్మునియొద్ద కేగుమని నన్నుఁ దొందరించె. ఇట్టిధర్మము ప్రపంచమున నెందైనఁ గలదా! ఏపురుషుఁడైనఁ దన్ను డాసిన కాంత నిష్టమున్న గ్రహించుట గలదు. లేదా నిరాకరించుట గలదు. కాని వీనివలెఁ దమ్మునిఁ జూపి వానియొద్దకుఁ బొమ్మనుట యెందైనఁ గలదా! ఇది యేదో పన్నుగడమైయుండవలెనని నేను తెలిసికొనలేక యీలక్ష్మణుని డాసి నావిషయమంతయు విన్నవించుకొంటిని. "కొడుకును జంపి మహాపరాధముఁ గావించితినే! దీని కీమాత్ర ముపకారమైనఁ జేయుద"మని వాఁడు తలంచెనా! ఏల తలంచును! వీఁడు వాని తమ్ముఁడేగదా! ఈలక్ష్మణునికడ నానైపుణ్యము నంతయుఁ జూపితిని. కాని ప్రయోజనము లేకపో

యెను. కట్టకడకు వీ రిద్దఱను గాల్చి పుటము వేసినను వారికి నాపైఁ బ్రేమ కలుగదని తెలిసికొంటిని. లక్ష్మణుఁడు మఱల తనయన్న సమీపమున కేగుమనియె. వానిమాట వానితలపైననే మోపఁదలఁచి రామునొద్దకు వెళ్లితిని. వానితో మాటాడునపుడు వానిభార్య సీత (దానికేమి యుండరాని తెగులో!) నన్నుఁ జూచి "యిహిహీ" యని నవ్వ నారంభించినది. అప్పటికి నేను కోపము నాపుసేయలేక దానిపైఁ బడితిని. రాముఁడు తమ్ముని బిలిచి నాముక్కుఁజెవులు గోయుమని చెప్పెను. ఆలక్ష్మణుఁ డెట్టి బోఁయముండకొడుకో! తన్నుఁ బ్రేమించి సమీపించిన వన్నెలాడినన్నైనలేక తటాలునఁ గత్తిదూసి నాముక్కుసెవులను గఱుక్కునఁ దెగఁగోసె. అవ్వలఁ బడునటు నన్నుఁ ద్రోసె. అయ్యో! యిట్టిస్థితి నాకు రాఁదగినదే! ప్రఖ్యాతివడసిన విద్యుజ్జిహ్వునిభార్యనై దైత్యరాజ్యాధినాథుఁడగు రావణున కనుంగుఁజెల్లెలనైన నాకీగతి పట్టిన నిఁక లోకములోని స్త్రీలగతి యేమికావలయును! కంటి కింపగు పురుషులఁ జూచిన స్త్రీలు నోరుచచ్చి దూరముగఁ బడియుండవలసినదేనా! పురుషులను స్వేచ్ఛగా సమీపించి పలుకరించు స్వాతంత్ర్యము స్త్రీజాతికి లేనేలేదా! వీరు ముక్కు-సెవులఁ గోసిపంపిన మఱియొకరు మఱియొక యంగమునుఁ గోసి పంపుదురు. మానవతులయిన నావంటికాంతలిట్టిపరిభవమున కోర్వఁగలరా! కావున నేను జనస్థానమున కరిగి నాసోదరులు ఖరదూషణత్రిశిరులతో నాపాటు చెప్పుకొంటిని. మహోద్దండసాహసుఁడగు మాయన్న ఖరుఁ డసంఖ్యరక్షస్సైన్యమును రామునిపైఁ బంపెను. కాని దుర్బలశరీరుఁడననియు నిరువురుభార్యలతో మెలఁగఁజాలననియు మిక్కిలి మెత్తగా వచించుచుండిన యానీలవిగ్రహము రాముఁడు యమభటులవంటి కఱకురక్కసుల నందఱఁ దనవాతఁ బెట్టుకొనెను. ఈవార్త దెలిసి మాయన్న మఱికొంత దానవసైన్యము నొసంగి దూషణుని త్రిశిరుని బంపెను. ఆరాముఁ డెట్టిపిడుగోగాని నేఁజూచుచుండఁగనే వారి నందఱను సమయించెను. ఎట్టకేలకుఁ దనయొద్దనున్న దైతేయవాహినీవర్గముల నన్నిఁటినిఁ దీసికొని ఖరాసురుఁడే యుద్ధమునకు వచ్చెను. అతఁడు నాయువు తీఱియే! ఆ పాడురాముఁడు ఖరాసురుని సైన్యయుతునిగా ఖండించి వైచెను. అయ్యో! యిప్పుడు తటస్థించిన స్థితి యేమి! కన్నకొడుకు పోయె. సిగ్గు పోయె. అందమైన ముక్కు-సెవులు పోయె. జనస్థానమునందలి రాక్షసులందఱు పోయిరి. కొండలవంటివారు ముగ్గురు తోఁబుట్టువులు పోయిరి. కాని రాముని శిక్షించువారు లేరైరి. సీతకు భంగము గలిగించుభంగి లేకపోయెను. నాకుఁగలిగిన పరిభవ మాసీతకును ఖరదూషణత్రిశిరులకుఁ గలిగిన మరణశిక్ష రామునకును గలుగువఱకు నాకు నిద్దుర పట్టదు. కానిమ్ము. బలపరాక్రమ

రాశియు నాశ్రితరక్షణుఁడును నగు మాపెద్దన్న రావణుఁ డున్నాఁడుగదా! ఆయన కీవార్త నెఱిఁగించెదను. నాభంగముఁ దీర్ప నాజగదేకవీరుఁడే తగినవాఁడు. ఇఁకఁ గాల హరణము సేయరాదు. సముద్రమును లంఘించెద. రావణుఁ దెచ్చెద. ఎంతసాహసు రాలురా! యీచుప్పనాక యని యప్పుడు రామలక్ష్మణు లాశ్చర్య మొందవలయును. ఆడుదాని సాహస మప్పుడుగదా జగంబునకుఁదెలియును. ఆడువాండ్ర లో తెవ్వ రెఱుంగుదురు! శీఘ్రముగ లంకపై వ్రాలెద. (నిష్క్రమించుచున్నది.)

ఇది విష్కంభము.



(రావణునాస్థానము. సింహాసనమున రావణుఁడును, దత్తదుచిత స్థలముల నింద్రజి ద్విభీషణ ప్రహస్త మహోదరులు నుందురు).

విభీ: దేవరసోదరుఁడు విభీషణుఁడు భక్తితోఁ గొలుచుచున్నాఁడు.

ఇంద్ర: దనుజసామ్రాజ్యాధినాథులకుఁ బ్రియకుమారుఁడు మేఘనాదుఁడు నమస్కరించు చున్నాఁడు.

ప్రహ: పురందరాది నిఖిల బృందారకసందోహ వందిత పాదారవిందా! నిజప్రతాప సూర్య ప్రభా విధ్వస్త సకలసుర గరుడోరగ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర గంధర్వ నాయక గర్వాంధకారా! మహారాజాధిరాజ రాజప్రతాప వీరనామాంకితా! రావ ణేశ్వరా! సర్వసేనాధిపతి ప్రహస్తుఁడు విధేయుఁ డగుచున్నాఁడు.

మహో: త్రయస్త్రింశత్కోటిదేవతాశిరఃపరికలిత హాటకకోటీరకోటీతట విరాజమాన మణి గణవిభా నీరాజన మనోహర పాదరాజీవయుగళా! లవణపారావార పరికల్పిత హరినీల ముద్రికాయమాన లంకాపురీమహాసామ్రాజ్యరమాధురంధరా! రావణప్రభూ! విధేయ సేనాధిపతి మహోదరుఁడు జోహారు లొనరించుచున్నాఁడు.

రావ: ప్రహస్తా! యీదిన మకంపనుఁ డెట్టియమోఘవార్తను దెచ్చెనో వింటివా! ఎవ్వఁడో యొక రాజకుమారుఁడఁట. వనవాస మొనరింప వచ్చెనఁట. ఇచ్చటికి వచ్చి లంకను నాశ మొనరించునఁట.

ప్రహ: అతనివాక్యములు పిల్లికి జ్వరమువచ్చె నన్నట్లున్నవి. సమస్తప్రాణులలో మానవులు మిక్కిలి దుర్బలులు. అట్టిచో మానవుఁ డొక్కఁడు శతయోజనవైశాల్యముగల లవణ సముద్రమును దాఁటుటయెట్లు! దాఁటి లంకకు వచ్చుటయెట్లు! వచ్చి మనల డాయుట యెట్లు! డాసి సంగరం బొనరించుటయెట్లు! గెలుచుటయెట్లు!

విభీ: అకంపనుఁడు బాగుగ యోజింపక మాటాడువాఁడు గాఁడు. ఆయన వాక్యములు వ్యర్థములని చెప్పుటకు వీలుపడదు.

ఇంద్ర: అకంపనుఁ డాలోచనాపరుఁడును గార్యవేదియుఁ గావచ్చును. కాని పరాక్రమ సంపన్నుఁడు కాఁడు. మఱియుఁ బరాక్రమశోభితుఁడు గానివాఁడు యుద్ధవిషయము లలో జోక్యము గలుగఁజేసికొనఁగూడదు.

రావ: మదీయనామోచ్చారణమాత్రమున భువనంబులెల్ల నడంకుచుండ నేఁడొక హీన నరుఁడు నన్నెదిరించి రాక్షసుల మడియించునఁట. ఇట్టి విచిత్రవార్తల వీ రెట్లు నమ్మ దురో! పనియంతయుఁ విడిచి వచ్చి నాకెట్లు వినిపించెదరో తోఁపకున్నది.

ప్రవేశము—సేవకుఁడు.

మహాస్వామిగారికి దిగ్విజయ మగుఁగాక. శూర్పణఖామహాదేవిగారు వచ్చియున్నారు.

రావ: రమ్మనుము.

సేవ: చిత్తము. (అనివెళ్లి శూర్పణఖతోఁ బ్రవేశించును.)

శూర్ప: మ॥ మనుజుండొక్కఁడు దండకాటవి మదోన్మత్తక్రియాభీలుఁడై
నను డాయంజనుదెంచి ముక్కు--సెవు లన్నా! కోసిపంపించె; సా
రనికాయంబులు గొల్వఁగా దనుజసామ్రాజ్యంబుఁ బాలించు నీ
యనుఁగుంజెల్లెలి కిట్టిపాట్లయిన దేవా! సేమ మెందుండునో!

ఇదె ముఖమునఁ గప్పిన గుడ్డ తొలఁగించెద. కనులారఁ జూడుము.(చూపుచున్నది.)

రావ: మ॥ ఎవఁడా! క్రూరుఁడు; బుద్ధిహీనుఁడు రవంతేనిన్ భయవ్యాప్తిలే
క విశేషోద్ధతి నిన్ను నాచెలియలిన్ గర్వాంధుఁడై యిట్లొన
ర్చె; వెసన్ జెల్పుము వానినామమును; నారీ! వీఁకమైఁబట్టి యీ
భువిపైఁ గూల్చెద; నీకు మిక్కిలిప్రియంబున్ గూర్తు శీఘ్రమ్మునన్.

అమ్మా! శూర్పణఖా! నీ కిట్టి కీ డాచరించిన ఖలుఁ డాఫాలనేత్రుఁడైనను దేవతా చక్రవర్తియయినను బట్టితెచ్చి వానిశిరమును నీపాదములకడఁ బెట్టెద. కల్పాంతకాల రుద్రు నెదిరింప సమకట్టిన యాఖలుం డెవ్వఁడు! మృత్యుదేవత నింటికే పిలుచుకొను చున్నాఁడు. దుర్వారపరాక్రమక్రమాటోపుఁడనగు నన్ను మఱచెనో! నిర్లక్ష్యభావ మున నున్నాఁడో తోఁపదు.

శూ: అయ్యో! యేమని చెప్పుకొందును!

గీ॥ రామలక్ష్మణు లిరువురు రాజపుత్రు; లర్కవంశజులు; దశరథావనీంద్రు
నాత్మజులు; వారిలో రాముఁ డానతిచ్చె; ముక్కు--సెవులను వానితమ్ముండు గోసె.

రావ: మంత్రులారా! వింటిరే! అకంపనుఁడు లేనిమాటలు వచించెనని మన మింతవఱకుఁ దలంచుచుంటిమి. ఆహా! మానవాధముఁడగు రాముఁడు నాచెలియలికి బన్నముఁగూర్చి నాఁడు. ఇం కెట్లోర్వవచ్చును! అమ్మా! నిన్ని ట్లొనరించిన రాము నూఱక విడిచి వచ్చితివా! జనస్థానమున ఖరున కీవార్త నెఱింగింపలేదా!

శూ: అన్నా! జనస్థానమున కేగి ఖరాసురునకు నాపరాభవ మెఱింగించు కొంటిని. అతఁడు రామునిపైఁ గొంతసైన్యమును బంపెను. కాని యాపాదురాముఁడు వారినందఱ నుఱుమాడెను.

రావ: ఏమీ! రాముఁడు దైత్యభటుల మడియింపఁ గలిగెనా!

శూ: మడియించుటలో సర్వసంహార మొనరించెను. అవ్వల ఖరుఁడు త్రిశిరుని బంపెను. రాముఁడు త్రిశిరుని ఖండించెను.

రావ: అయిన నిప్పుడు త్రిశిరుఁడు జీవితుఁడుకాఁడా!

శూ: కాఁడు పిమ్మట ఖరుఁడు దూషణుని బంపెను. వానినిఁగూడ రాముఁడు భక్షించెను.

రావ: అయిన దూషణ త్రిశిరు లిరువురు మనకు లేరా! అయ్యో! తరువాత ఖరుఁ డేమి చేసెను!

శూ: ఏమియుఁ జేయలేదు. మిగిలిన దైతేయసమూహముతో రణమునకు వెడలి ప్రియ సోదరుల దూషణత్రిశిరులఁ జూడఁగోరి యమసదనమున కరిగియున్నాఁడు.

రావ: కటకటా! యెంతటికార్యము జరిగినది! ఆరాముఁడు నాప్రియసోదరికి భంగము గలిగించుటయేగాక, మువ్వురుతోఁబుట్టువులను పదునాల్గువేలు దైత్యభటులను గీటడంచి యున్నాఁడు. కొండలవంటివారు ముగ్గురు సోదరులు మరణించియుండ నా కెట్లుండును! దుర్వార మదీయ కరాలంకృత ప్రచండఖడ్గధారల నారాముని శిరమును ద్రుంపకున్న నాకోపాగ్ని నాదేహమును దహించును. ప్రహస్తా! శీఘ్రముగఁబోయి రథమును దీసి కొనిరమ్ము. హర్మ్యమునకుఁ బో నక్కఱ లేదు. ఇచ్చటినుండియే జనస్థానమునకుఁ బోవుదము.

ఇంద్ర: తండ్రీ! నావిన్నపము నాలింపుము.

మ॥ దనుజానీకములన్నియుఖ్ గడునసాధ్యంబాచు భీతిల్లి ని
ల్చినవేళ్ నిశితాస్త్రధార సురలఖ్ జీకాకుగావించి యిం
ద్రుని బంధించిన పుత్త్రుఁడుండ నొకమర్త్యుఖ్ బట్టి శిక్షింప నో
జనకా! నీ వరుగంగనేల! నను నుత్సాహంబునఖ్ బంపుమా!

శత్రుగర్భనిర్భేదకముగ రణ మొనరింపఁగల యస్మాదృశపుత్రులును లెక్కకు

మీఱిన సేనానులు నిన్నుఁ గొల్చువా రుండఁగా నొకమనుష్యమాత్రుని శిక్షింప నీ వరుగ నేల! నీవిధేయపుత్రుని నన్నంపుము. అరక్షణమున నారాముని శిరము దెచ్చి నీ పదసమీపమునఁ బెట్టెద.

ప్రహ: ఒకహీనమానవు నణఁచుటకు దేవరయు నంతటిపరాక్రమరాశియగు మేఘనాదుఁడును బయలుదేఱ నేల! నే వెళ్లి కర్తవ్యము నొనరించి వచ్చెద. అనుగ్రహించి నన్నుఁ బంపుము.

మహో: రాక్షసులకును మనుష్యులకును సింగములకును జింకలకును గల మర్యాద. ప్రతాపహీనుఁడగు మనుజు నొక్కనిఁ గడతేర్చుటకు మీ రంద ఱేటికి! నన్నంపుఁడు. వాఁడు నా కొకపూటకింది కైనఁ జాలఁడు.

రావ: మేఘనాదా! ప్రహస్తాదిమంత్రులారా! యారాముఁడు సంహరించినది నాసోదరులను. భంగపఱచినది నా చెలియలిని. కావున మిమ్ము బాధించునంతకంటె నీవిషయము నన్ను మిక్కిలి సమీపముగ బాధించుచున్నది. మేఘనాదా! నీ విచ్చట నుండుము. అకంపనుఁ డంతగ వర్ణించిన రాముఁ డెంతబలవంతుఁడో నేను పరీక్షించెద. ప్రహస్తా! త్వరితముగ రథముఁ గొనిరమ్ము.

ప్రహ: భాగ్యము. (లేచుచున్నాఁడు.)

విభీ: అన్నా! యొకక్షణ మాగుము. ఇప్పుడు కాఁగల కార్య మిఁకఁ గొంతవడికైనఁ గాఁగలదు. అచ్చటి వృత్తాంతము విశదముగ నరయుదము. అమ్మా! శూర్పణఖా! నీ వా రాము నెందుఁ జూచితివి? ఏ సందర్భమునఁ జూచితివి?

శూ: అయ్యో! యది మఱియొక వ్యసనమును జ్ఞప్తికిఁ దెచ్చును. నాపుత్రుఁడు జంబుకుమారుఁ డొకపొదయందుఁ గూర్చుండి తప మొనరించుచుండెను. మధ్యాహ్నము నేను భోజనముఁ గొనిపోవునప్పటికి కాపొదయు జంబుకుమారుఁడును దెగి పడియుండిరి. అంత నచ్చటి మునులు వచ్చి వనవాసమునకై గౌతమీతీరకాంతారముల వసించు రామలక్ష్మణులను నిరువురు రాజపుత్రులలో లక్ష్మణుఁ డనువాఁడు పొదతోఁగూడ జంబుకుమారుని దెగనఱికెనని చెప్పఁగా దుఃఖము పట్టఁజాలక వానిని మ్రింగవలెనని వాఁడున్న పర్ణశాలకడ కేగుచుంటిని. అప్పు డచట నున్న వానియన్న రాముఁడు నన్నుఁ జూచి మోహించి నాపైఁ బడవచ్చెను. నేను వాని నిరాకరించితిని. ఇంతలో లక్ష్మణుఁడు వచ్చెను. నన్నుఁగని వానికి నదే రోగ మెత్తెను. నే నిరువురను గైకొననని చెప్పితిని. అంతట రాముఁ డాజ్ఞాపించెను. లక్ష్మణుఁడు ముక్కు-సెవులు గోసెను.

విభీ: పర్ణశాలకడ రామలక్ష్మణు లిరువు రేనా యుండినది!

శూ: ఇరువురును, రాముని భార్య సీతయు నుండినది.

విభీ: రామలక్ష్మణులు నీతో మాటాడునప్పుడు సీత యెందుండెను!

శూ: మిణకరించుచు మగని చెంతనే యుండెను.

విభీ: ఇట్లు నిన్ను మాటాడుట పాడిగాదని యామె మగనికి మఱందికి బోధింపలేదా?

శూ: ఏమియు బోధింపలేదు. మీఁదు మిక్కిలి నన్నుఁ జూచి నవ్వ నారంభించినది.

రావ: విభీషణా! యిప్పు డాప్రశ్నములతో నేమి ప్రయోజనము! ఈవెడమాటలతో నామె హృదయముఁ గలఁచుచున్నావు. జరగవలసిన కార్యమున కాలస్యముఁ గలిగించుచున్నావు.

విభీ: దేవా! వినయముతో విన్నవించుచున్నాను. పొదలో జంబుకుమారుఁ డున్నాఁడని తెలియక లక్ష్మణుఁడు నఱకియుండును. శూర్పణఖతో మునులు తమంతవచ్చి లక్ష్మణుఁ డిట్లొనరించెనని చెప్పియున్నారనుటనుబట్టి యాలోచించిన భ్రమమున నతనితో నేమియో చెప్పి మునులే జంబుకుమారునిఁ జంపించియుందురని నాకుఁ దోఁచుచున్నది. అది విని మన చెలియలు లక్ష్మణున కెగ్గొనరించుటకై పోయినది. రామలక్ష్మణు లీమెకుఁ గొంతవఱకు శాంతము బోధించియుందురు. రాముఁ డీమెను జూచి మోహమునఁ బైఁబడియుండునని నాకు నమ్మకము గలుగలేదు. ఇల్లాలిసముఖమునను దమ్ముని సమక్షమునను నెట్టిమూర్ఖుఁడైనఁ బరసతిపైఁబడ సాహసింపఁడు. ఆరామలక్ష్మణులు సత్పురుషులనియు శౌర్యవంతులనియు నకంపనునివలననేగాక యనేకులవలనగూడ నేను వినియున్నాను. శూర్పణఖమాత్రము వకార్యమును జూపియుండును. ఎట్లో మాటలసరణి నుభయపక్షములవారికిని గోపము పుట్టియుండును. అంత రాము నానతిమై లక్ష్మణుఁ డీమె ముక్కు-చెవులు గోసియుండును. తరువాత నీమె ఖరాసురాదులఁ దోడ్తెచ్చియుండును. తనపై వచ్చిన రాక్షసుల రాముఁడు నుఱుమాడియుండును.

శూ: కొడుకును గోలుపోయి ముక్కు-చెవులు నఱికించుకొనినను దప్పంతయు నాయదిగనే నీకుఁ గనఁబడుచున్నది. నన్నింతచేసి తమ్ముల ముప్పురఁ బొట్టఁబెట్టికొననే యారాముఁడు నీ కింకను సత్పురుషుఁడుగఁ గనఁబడుచున్నాఁడా! అయ్యో! శిక్షార్హుల దండింపకున్న లోకమునకు సేమము గలుగునా!

రావ: అమ్మా! యతనిమాటలు నీవు చెవిఁ బెట్టకుము. అతఁ డెప్పుడు నీళ్లు నమలెడివాఁడే కదా! తొలుతటినుండి చూచినవాఁడెకాని నేఁడు క్రొత్తవాఁడుగాఁడుగదా విభీషణుఁడు! నీవు కోరినట్లు రాముని నేను దండించెదను లెమ్ము.

శూ: అన్నా! నావిషయమున శ్రద్ధ వహింపుము.

చ॥ "సకలజగమ్ములన్ గెలువఁజాలిన రావణునట్టి దోర్బలా
ధికుఁడు ప్రతాపరాశి రణధీరుఁడు చెల్లెలి సూడు దీర్పఁజా
లక పడియుండె"నంచని యిలన్ గలవారలు నీప్రతాపమున్
బకపక నవ్వుచుంద్రు; కులపావన! నీ విపు డూఱకుండినన్.

అన్నా! నాబన్నముఁ దీర్పకున్న నేను మనఁజాల. నిక్కముగ నీపాదములకడఁ బ్రాణములు విడిచెద. రావణేశ్వరా! నీ వా రాము నంత మొందించిన నాకుఁ బ్రాణదాన మొసరించినవాఁడ వగుదువు. అందు నీకును లాభము గలదు. ఆరామునిభార్య సీత వంటి నిరుపమానసౌందర్యవతి యీలోకమునఁ గాదు. ముల్లోకములలో లేదు.

గీ॥ ప్రవసకోదండుచేతి యాఱవశరంబు! నిలుకడ వహించు క్రొక్కారుమెఱుఁగు!
తనువు ధరియించు భువనసౌందర్యధనము! సీత సింగారము నుతింప నాతరంబె!

ఆహా! యేమి యా ముఖలావణ్యము! ఏమి యాకర్ణాంతవిశాలములయిన యా లోచనముల సొంపు! ఏమి యా వాలారుఁజూపుల యందము! ఆ నెన్నుదురు తీరు! ఆ ముంగురుల సొరు! ఆ కపోలముల కాంతి! ఆమె బాహువులు కోమలమృణాళములఁ దృణీకరించుచుండును. ఆమె పాదము లరవిందముల హసించుచుండును. నీయధీనమున నీపాలనమున నుండు సుర గరు డోరగాంగన లామె కాలిగోటి కైన సాటిరారు. రాముని శిక్షించి నాబన్నముఁ దొలఁగించి సీతను నీవు విజయధనముగఁ దెచ్చుకొనుము.

విభీ: (స్వగతము) తొలుతనే స్త్రీలోలుఁడైన యీరావణుని శూర్పణఖ మఱింత చలింపఁ జేయుచున్నది. అయ్యో! యీవిన మేమి ప్రళయము పుట్టునో!

రావ: చెల్లెలా! నీకు భంగము గలిగించి యారాముఁడు నా కెంతయు నపచారము గావించినాఁడు నీకు సంతోషము గలుగునట్లు రాముని శిక్షించెద. సీతను బట్టితెచ్చెద. ప్రహస్తా! కార్యము నెట్లు నడుపవలయునో యోజింపుము. ఒక్కవ్రేటునకు రెండు పక్షులు పడవలెను.

ప్రహ: విన్నవించుకొనెద. ఇప్పుడు కావలసినవి రెండుపనులు. రాముని శిక్షించుట-సీతను దెచ్చుట. వీనిలోఁ దొలుదొల్త రామునితో యుద్ధము నారంభించుటకన్న నెక్కుడైన సీతను దెచ్చుటయే మేలు. సీతను మనము తెచ్చిన, భార్యకొఱకు రాముఁడే మన మున్న యెడకు వచ్చును. అప్పుడు మనము వానిని సమయింపవచ్చును. ఒకవేళ రాముఁడు మనయొద్దకు రాకున్న రాకపోనిమ్ము. వానితో మన కేమిపని! అదిగాక

సీతయెడఁగూడ మనశూర్పణఖామహాదేవి కాగ్రహమే కలదు. కావున నన్నివిధముల మొదట సీతను దెచ్చుటయే యనుకూలముగ నుండునని నాయాశయము.

విభీ: ప్రహస్తా! సమీపవర్తులగు మంత్రు లెప్పుడు నధిపతుల క్షేమమునకై పాటుపడుచు వారికి హితమును బోధింపవలెను గాని ప్రియము పలుకఁగూడదు. నీప్రియోక్తులవలన నీరాక్షసేశ్వరునకు ముప్పుఁ దెచ్చిపెట్టుచున్నావు. అధిపతికి స్త్రీలను దార్చుటకన్న హితము నుపదేశించిన నీ వమాత్యుఁడ వైనందులకు ఫలము గలుగును.

ప్రహ: నేను తనక్షేమమునకై పనిచేసెడువాఁడనో కానో దేవర యెఱుఁగును. ఈ నా దేహప్రాణములకన్న నాయన శ్రేయము నెక్కుడుగ భావించి చరించుచుంటిని. రావణేశ్వరుఁ డాలోచన యడిగినందునఁ దోఁచినది విన్నవించుకొంటిని! కాని నేను నీవలె ననవసరసంభాషణ మొనరించువాఁడఁగాను.

రావ: ప్రహస్తా! యీయనతో నేల వాదు. పోనిమ్ము. సుర నరు నాగనాసికములఁ జీల్చి చెండాడిన నాకు హీనుఁడగు రామునితోఁ బోరవలెనను కుతూహలము లేదు. సీత మిక్కిలి సౌందర్యవతియని నాచెల్లెలు చెప్పుచున్నది. కావున నిప్పుడామెను తప్పక తేవలెను. నీ విప్పుడ పోయి నాపూర్వమంత్రియగు మారీచు నిచ్చటికిఁ దోడ్కొనిరమ్ము.

ప్రహ: అరగడియలో మారీచుని బిలిచికొనివచ్చి దేవర యెదుట నిలిపెద.

(నిష్క్రమించుచున్నాఁడు.)

విభీ: అన్నా! యీప్రహస్తాదులమాట నీవాలకించుట భావ్యముగాదు. ఆరాముఁడు దేవతల ప్రార్థనమున సకలభువనభారముమాన్ప దశరథునిగర్భమునఁ బుట్టిన శ్రీమహావిష్ణుఁడు. సామాన్యనరుఁడు గాఁడు. అట్టివానితోఁ బోరు దేవరకు క్షేమంకరముగాదు.

రావ: విభీషణా! యకంపనుఁడును నీవును దేవతల నూఱక పొగడి పొగడి పడిపోవుచుందురు గాని వారిపరాక్రమము నేను చక్కఁగా నెఱుఁగుదును. అది యెట్లున్న నీశూర్పణఖను భంగపఱచి యీరాముఁడు నన్నుఁ జెనకియున్నాఁడు. నన్నుఁ జెనకుట నిద్రించు సింగము జూలుపట్టిలాగుట. విభీషణా! చెలియలికి బన్నము గూర్చి మువ్వురుసోదరులఁ జంపి యొకమేనల్లు నంతమొందించిన యీరామునిఁ బూవులు నక్షతలు పెట్టి పూజించి నమస్కరింపుమనెదవా! వాఁడు తప్పక తత్ఫలము ననుభవింపనే వలయును. సీతను నేఁ దెచ్చికొననేవలయును.

విభీ: అన్నా! యీసీతాదేవి లోకమాత. ఆమహాసాధ్విపై నిట్టి తలంపు పాడిగాదు. ఆమె నీకుఁ దక్కదు.

ఉ॥ దేవ! పతివ్రతాంగనల దేవత లెప్పుడుఁ గాచుచుండు; రా
దేవత లుండుపట్టుననె తేకువమై విజయంబు నుండు; దు
ర్భావముతోఁ బతివ్రత ధరాత్మజఁ బట్టఁగఁబోయితేని నీ
దా విభవంబు రాజ్యము రయమ్మున భంగమునొందు నెమ్మెయిన్.

పతివ్రతల కెగ్గాచరించుట దేవతల కపచారముచేయుటయే యగు.

రావ: దేవతలు పరమధర్మనిరతులు! పరస్త్రీలఁ గన్నతల్లులవలెఁ జూతురు! వారివర్తనము నీకు మఱపునకు వచ్చియుండిన నే నెఱిఁగించెద. వినుము.

సీ॥ తనగురుపత్నియా తారావధూటితోఁ గలియఁడే యాహిమకరుఁడు తొల్లి!
గౌతముసతి నహల్యాతరుణినిఁగూడి కూయఁడే యింద్రుఁడు కోడియగుచు!
నమరవేశ్యను మేనకాంబుజేక్షణను విశ్వామిత్రమౌని చేపట్టలేదె!
రజతాద్రివాసుఁడా రాజశేఖరుఁడు గంగామహాదేవినిఁ గలియలేదె!

గీ॥ నీవు మెచ్చెడి మునులును దేవతలును। స్త్రీల పాదముల్ గొలుచుచు సేవచేతు;
రట్టియెడ వారలే సుగుణాఢ్యులనుచుఁ। బ్రేలుచున్నావె! ఛేల! నా ప్రోల నేఁడు.

మదీయామోఘాస్త్రతీవ్రత్వమును నీదేవతలును దివ్యమును లెన్నిమోమాటులో చూచియున్నారు. నోరున్నదని యూఱక వారల నాకడ నుతింపకుము.

విభీ: రావణేశ్వరా! దుష్పథములఁ దిరుగువారు దేవతలైనను మహర్షులైనను జగంబున కాదర్శపురుషులు కాఁజాలరు. ఇంద్రుఁడు చంద్రుఁడు శిక్షింపఁబడిరని యెఱుఁగవా! స్త్రీలను జెఱఁబట్టి తెచ్చుట మహాపాతకములలో మహాపాతకము. నీ వెప్పుడును స్త్రీలను జెఱపఁజూచెడు ఫలము మన మింతకుముందే యనుభవించితిమి. నీవు గంధర్వులపైకి దాడివెడలినపుడు నేను సముద్రమున మునింగి నిష్ఠ ననలంబించియుంటిని. ఇంద్రజిత్తు దీక్షితుఁడై ముఖము నిర్వర్తించుచు మౌనముతో నుండెను. కుంభకర్ణుఁడు నిద్రించుచుండెను. అప్పుడు మధుఁడను రాక్షసుఁడు వచ్చి మనచెల్లెలిని గుంభీనస నెత్తికొనిపోయెను. నీ వొకరి యాండ్రను జెల్లెండ్ర నెత్తికొనివచ్చిన మనచెలియలి నింకొకఁ డెత్తికొనిపోయి చెఱనుంచె. కావున స్త్రీవిషయకమైన యీదురుద్యోగమున నపకీర్తి వచ్చును. నీకే కాదు. నీకన్న బలవంతులకైనను హానియుఁగలుగును.

రావ: వయోజ్ఞానజ్యేష్ఠుఁడనగు నన్ను నిఖిలదైతేయజనసమక్షమున నిండోలగమున నధిక్షేపించి యెత్తిపొడుచుచున్నావా! నీముఖముఁ జూడఁగూడదు. ఛీ! దూరము పొమ్ము. (త్రోయుచున్నాఁడు.)

విభీ: రావణా! నీవు తెలిసికొనకున్న నాతప్పు గాదు.

చ॥ ధనువును టంకరించి బలధాముఁడు రాముఁడు గర్జదభ్రమో
యన శరవర్షముల్ గురిసి యాప్తతనూజ భటాళితోడఁ బో
రన నినుఁ దాఁకినట్టియెడ రావణ! దిక్కొకయింతయైన లే
క నిలిచినప్పుడైన నెఱుఁగంగల వీవు మదీయబోధముల్.

(నిష్క్రమించు చున్నాఁడు.)

రావ: (స్వగతము) ఏయుత్సాహకార్యముఁ దలపెట్టినను విభీషణుఁడు పానకములోని పుల్ల వలె నడ్డువచ్చుచుండును. శాంతము శాంతమని మొఱపెట్టుచుండునేకాని రాక్షసుల కుండవలసిన బలక్షాత్రము లుదాహరణమునకైన నితనియెడఁ గానరావు.

(మారీచునితోఁ బ్రవేశించి.)

ప్రహ: దేవా! మారీచుని బిలిచికొని వచ్చితి.

మారీ: విధేయమంత్రి మారీచుఁడు నమస్కరించుచున్నాఁడు.

రావ: మారీచా! నీవు నాకుఁ జిరాప్తమంత్రివి. ఇప్పుడు నా కొక కార్యమునకై నీసాయము గోరుచున్నాను.

మా: ఎట్టిసాయము గావలసియున్నను విధేయసేవకుఁడు సిద్ధముగ నున్నాఁడు.

రావ: దండకారణ్యమున రామలక్ష్మణులను నిరువురు రాజకుమారు లున్నారఁట. ఆరాముని భార్య సీత మిక్కిలి సౌందర్యవతియఁట. ఆకాంతపై నాకు మనస్సు గలిగియున్నది. నీవు మృగరూపముఁగొని యారాము నెట్లైన నలయించుకొని దూరము గొనిపోవలెను. అవ్వల నేను కార్యము సవరించుకొనెద.

మా: (నివ్వెఱపడి స్వగతము) ప్రళయము తటస్థించినది. కోరి కోరి రామునిభార్యనా యితఁడు కోరుచున్నాఁడు!

రావ: మారీచా! యనుకూలోక్తులు పలికి నావీనులకు విందొనరింపక యేమ ట్లూరకున్నావు! ఆరామునకై నీవు వెఱచితివా! లేక నేఁదెలిపినదానికన్న మేలైన యుపాయము నాలోచించుచుంటివా!

మా: దేవా! మేలగు నుపాయము నాలోచించుచుండలేదు. రామునిఁజూచియైన నీవు సీత విషయమై తలపెట్టకుండుట మంచిదిగ నుండునని యోజించుచున్నాను.

రావ: మారీచా! బేలలగు నకంపనాదులవలె నీవును రామునకై భయపడితివా! నిఖిల దేవతాసమూహములతో వెట్టి సేయించుకొనుచు నిరంకుశముగ దనుజసామ్రాజ్యము నేలు నేను నీవెంట నుండునుగదా! నీ వేల భయపడెదవు! ఉత్సాహముతోఁ గార్యమునకుఁ గడఁగుము.

## ద్వితీయాంకము.

మా: రాక్షసేశ్వరా! నేను నీక్షేమము గోరువాఁడనేకదా! నావిషయమునే యెఱింగించెద వినుము. పూర్వ మొకనాఁడు విశ్వామిత్రుఁడను మునీంద్రుఁ డొనరించు యాగమునకు విఘ్న మొనరించు తలంపున నేనును నాతమ్ముఁడు సుబాహుఁడును వెళ్లియుంటిమి. రాముఁ డచ్చటికి వచ్చి మాభటులనెల్లఁ దునుమాడెను. ఆసందర్భమున రాముని సాయక మొకఁడు వేయియోజనముల బలమున నున్న నన్ను శతయోజనముల దూరము గొనిపోయి వైచినది. ఒకబాణమున సుబాహుఁడు మరణించె. అప్పటి నుండియు రాముఁడనిన నేను కలలోఁగూడ భయపడుచుందును. మునులయెడ రాముని కను భక్తి మిక్కుటము. కావున నేను కాషాయాంబరధారినై యానాఁటినుండియు జపము నభినయించుచు మునివృత్తిఁ బైవైచుకొని కాలముఁ గడుపుచున్నాను.

రావ: కపటవృత్తిఁ గైకొనినందున నీకుఁ దెలివి కొంచెము తక్కువ యైనది. మారీచా! రాజ్యచ్యుతుఁడు, నరణ్యవాసి, సైన్యహీనుఁడు, దుర్బలదేహుఁడు, నగు నారామునకై నీవు భయపడిన భయపడవచ్చును. కాని దుర్వారప్రతాపమున లోకములనెల్లఁ గాల్చు నేను భయపడువాఁడనా! మఱుమాటాడక చెప్పినట్లు వర్తింపుము.

మా: దేవా! నేను భయపడి రాముని గీర్తించుచుంటినో లేక యతఁడు స్వభావముతోడనే మహాప్రతాపోదయుఁడో యతనికార్యములే తెలుపును.

సీ॥ చిఱుతకూఁకటినాఁడె కఱకురక్కసులను నఱకి మునీంద్రుజన్నంబుఁ గాచె;
హరువిల్లు నవలీల విఱిచి కోదండదీక్షాగురుండనుచుఁ బ్రఖ్యాతి నొందె;
నారణ్యసీమఁ గాకాసురుని విరాధు నుఱుమాడి తాపసేశ్వరుల మనిపె;
ఖరదూషణాదిరాక్షసులను బదునాల్గువేలమందిని బట్టి పీచ మణఁచె;

గీ॥ నెన్నిమాఱులో దనుజుల నేపుమిగిలి। యొక్కఁడే యుక్కడఁచె; రాముఁ డొక్కహీఁ
డని తలంచెదె! నిఖిలసురాసురులును। జేరి వచ్చిన దేవ! యడేయుఁ డతఁడు. [నుఁ

రావ: మారీచా! యొకచిన్నజన్నముఁ గాచుటయు నొకవిల్లు విఱుచుటయు మిక్కిలి గొప్ప కార్యములని పొగడుచుంటివా! ప్రాభవహీనుఁడగు రామునికడ ముల్లోకములఁ గలంచిన నేనంత చులకగఁ గనఁబడుచుంటినా! నాప్రతాపము నెంతలో నీవు మఱచితివి!

సీ॥ మూఁడులోకము లేలు భూరిబలోద్దాము నింద్రుని దాఁకి జయించినాఁడ;
గాలకేయనివాతకవచాదిదైత్యుల నాహవంబునను జక్కాడినాఁడ;
ననియందునను గుబేరుని బీచ మణఁచి పుష్పకవిమానము గొనివచ్చినాఁడ;
యక్షగంధర్వచయంబులఁ బలుమాఱు దోర్దర్పమునఁ బాఱఁదోలినాఁడ;

గీ॥ నంతయేటికి! నీదు రామావనీశు। వంశకర్త సూర్యుని భయపఱచినాఁడ;
భేల! నాత్రోల రాముఁడే విష్ణుఁడనుచు। బలికెదవె! యించుకైనను దెలివి వలదె!

పూర్వమంత్రివని సైరించితి. ఒరులైనఁ దప్పక తెగనఱకియుందు. నీయుపన్యాసములతో నాకుఁ బని లేదు. నీ విప్పుడు నాకార్యమునకుఁ దోడ్పడెదవో! నాయానతి నిరాకరించెదవో తెలుపుము. జాగు సేయకుము.

మా: చెట్టుపోవు వేళకుఁ గుక్కమూతిపిందెలు పుట్టును. కాలము చెడనున్నప్పు డిట్టి బుద్ధులు పుట్టుచుండును. నిన్ననవలసినది లేదు. రక్షోవంశము చెడనున్నది. రామునిచే నీవును నేను నంతమొందవలసిన కాలము వచ్చినది.

రావ: ఛీ! మూర్ఖా! యెన్నివిధముల బోధించినను నీకు మంచిబుద్ధి గలుగకున్నది. నాయాజ్ఞ నతిక్రమించితివి. నిన్ను మన్నింపఁగూడదు. ఇదె నాచంద్రహాసమున నీకంఠముఁ ద్రుంచెద. నీవలెనే యనుచితోక్తులాడు విభీషణాదిదుర్మార్గులకు బుద్ధివచ్చునట్లు చేసెద. (నఱుకఁబోవుచున్నాఁడు.)

మా: వలదు. వలదు. మన్నింపవలెను. నేను విధేయుఁడ నయ్యెద.

రావ: ఇంతదూరము రాముని బొగడుచు నన్నుఁ దిరస్కరించుచుండిన నీవు నాకు విధేయుఁడవగుదువన్న నేమి నమ్మకము! మరణముఁ దప్పించుకొన నిట్లనుచుంటివి. నిన్ను శిక్షింపక వదలను.

మా: నిశ్చయముగ విధేయుఁడ నయ్యెదను. ఈవిషయమున సూక్ష్మముగ నాలోచించి నిర్ణయించుకొంటిని. మృగరూప మెత్తి దండకారణ్యమున కేగితినేని రాముఁడు తప్పక నన్నంతము నొందించును. మృగరూపము ధరింపకున్న నీవు చంపుదువు. రెండువిధములను నాకేమో చావు తప్పదు. ఆసన్నమైన యీమరణములలో నీచేఁ జచ్చుటకంటె రామునిచే మరణించుటయే నాకు మిక్కిలి యిష్టమైనది. ఎందుకన మృగరూపమెత్తి మొదలు నీయానతి నిర్వహించి స్వామిద్రోహము లేకుండఁజేసికొనినవాఁడ నగుదును. నీచేనైన నిప్పుడే చావవలయును. రామునిచేనైన దండకాటవికిఁ బయనించు వ్యవధి యుండును. మఱియును రాక్షసుఁడవగు నీచేఁ జచ్చుటకంటె మహావిష్ణుఁడగు రామునిచే మడియుటయే పరమశ్రేష్ఠము. కావున నీయాజ్ఞకు లోఁబడునట్లు నిశ్చయించుకొంటిని.

రావ: నీమరణవిషయమై నీయిష్టమునకువచ్చునట్లు నిర్ణయించుకొనుము. ఎప్పుడు పయనింతము.

మా: దేవర యాలస్యమేగాని నాయాలస్యము లేదు.

రావ: ఈదినమే వెళ్లుదము.

మా: ఇప్పుడ కదలుదము.

రావ: అమ్మా! శూర్పణఖా! మేమిరువురము వెళ్లెదము. నీవు చింతదక్కి యుండుము. మారీచా! పోదమురమ్ము.

శూ: అన్నా! మారీచా! నీలో నున్నది మెలఁకువ. ఎట్లు మెలంగుదువో!

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# సీతాపహరణము.

## తృతీయాంకము.



(పర్ణశాల—సీతా రామ లక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

రా: తమ్ముఁడా! లక్ష్మణా! యభ్యాసబలమున వేము చేఁదని తోఁపని విధమున నలవాటు కలిమి నీయరణ్యావాసము మనకుఁ దొలుతటివలె నంత కష్టముగఁ గనఁబడుచుండ లేదు.

ల: అవును. చిరతరానుభవసంపత్తిచేఁ గష్టములు కష్టములుగఁ దోఁపవు. అభ్యాసవశమున విషముఁగూడ భక్షింపవచ్చును. ఈదండకారణ్యావాసము మనకు బాధాకరము గాక యున్నంతలో సుఖదాయకముగనే కనఁబడుచున్నది.

సీ: నాథా! యభ్యాసమయియుండుటవలన నీయరణ్యములోని కొండమల్లె లయోధ్యాపురమున నుపవనములోని పారిజాతపుష్పములవలెఁ బ్రమోదదాయకములై యున్నవి.

రా: కాంతా! నీమాధ్ధ్యము నాకు ముదముఁ గూర్చుచున్నది. మనపర్ణశాలాసమీపమునందలి జలాశయమునకు వచ్చుచుండు బాలహరిణము లయోధ్యాశుద్ధాంతమునందలి నీయనుంగుఁజెలికత్తెలవలె సంతోషముఁ గలిగించుచుండునని నీవు పలుమాఱు చెప్పుచుండలేదా!

సీ: అవును. మాధ్ధ్యప్రధానములయిన కన్నెలేళ్లను జూచునప్పుడు నామనస్సున కత్యంతోత్సాహము గలుగుచుండును. ఈసృష్టియందలి జంతువులలోనెల్లఁ గురంగంబులే నాకు మిక్కిలి కూర్చునవి.

రా: అవును. విశాలములై మనోహరములై స్నిగ్ధపురుచులఁ గుప్పుచుఁ జంచలములయిన నీ వాలుఁగన్నులవంటి కన్నులు గలిగియుండును గనుక సీతా! నాకును హరిణములు మిక్కిలి కూర్చునవియే!

సీ: తరుచ్ఛాయలలో లేళ్లిటు నటు గంతులువేయుచుండఁ జూచుట కెంతయు మనోహరముగ నుండును. (దృష్టి నిగుడించి) నాథా! యాకెలఁకునఁ జెట్లనీడలలోఁ జూడు నొక మృగము గనఁబడుచున్నది. అది గంతులు వైచుచు మన సమీపమునకు వచ్చుచున్నది. ఆమృగము లభించిన నేను మిక్కిలి సంతోషింతును.

రా: అవును. అది చాల రమణీయముగ నున్నది.

చ॥ కలువల గేరు నేత్రములు; కాంచనముఁ బోలి మెఱయించు దేహముఁ;
తళుకు తళుక్కుమను పొడలు; తద్దయు భాసిలు ముద్దుమోము; ప
చ్చలజిగి మీఱు గిట్టలును; జారుతరంబగు మూర్తి గల్గి యో
జలజదళాక్షి! యీహరిణశాబము నామనసుఁ హరించెడుఁ.

దేవీ! యిది సాధారణహరిణముగఁ దోఁపదు. దీనిమేనిజిగియు మనోజ్ఞతయు మి క్కిలి మెచ్చఁదగినవి.

సీ: నాథా! యీహరిణమును జూచినప్పటినుండియు దీనిని నాదానినిగఁ జేసికొనవలెనని కోర్కియగుచున్నది. దీని నెట్లైన నాకుఁ దెచ్చియిమ్ము. కాదనక నా యీ ముద్దు చెల్లింపుము.

రా: దేవీ! యీముద్దులేఁడి యెవ్వరి మనస్సునైన నాకర్షింపఁగలిగి యున్నది. దీనిని నీవు కోరుట యొకవిశేషము గాదు. అవశ్యము తెచ్చియిచ్చెద.

సీ: అయ్యాది యొకవేళ మీచేఁ బట్టువడకపోయిన మీబాణధార దానిఁ బడవైచి ముద్దు లొలుకు దాని చర్మమునైనఁ దెమ్ము. సాధ్యమగునంతకు సజీవముగఁ దేఁబ్రయ త్నింపుము.

రా: రమణీ! కోరక కోరక యిన్నాళ్లకీ మృగముఁ దెచ్చియిమ్మని కోరితివి. నీకోర్కి నవ శ్యము మన్నించెద. (లక్ష్మణునిదెసఁ జూచి)

గీ॥ జనకనందన యీమృగశాబకమును। దనకుఁ దెచ్చియిమ్మనియె; నద్దాని నొడిసి
పట్టితేవలెఁ; గావున బాణములను। నామహాధనువును దెచ్చి నా కొసంగు!

ల: (స్వగతము) ఈమృగమును జూచినది మొదలు నాహృదయ మేలనో శంకనొందు చున్నది. నానావిధమృగములఁ జూచితిఁగాని, బంగరుజింక నెన్నఁడు గనినదిలేదు. ఎవ్వఁడో యొకరాక్షసుఁడు మమ్ము మోసగింపనెంచి యీరూపము గ్రహించి యుండనోపు.

రా: లక్ష్మణా! యేమ ట్లాలోచించుచున్నావు! ధనుర్బాణములఁ దెమ్మంటినే! వినలేదా!

ల: దేవా! వింటిని. ఇది మాయామృగమని తోఁచి శంకించి దీనిని బట్టుటకై నీవు వెడలు చుండ నిద్దానివలనఁ గీడు గలుగునేమోయని సందేహించుచున్నాను.

రా: లక్ష్మణా! నీకెంతటి వెఱ్ఱి! నీవనిన ట్లిది మాయాహరిణమనియే తలఁచుదము. దీనివలన నాపద వాటిల్లుననియా శంకించుచున్నావు! అన్నా! యెన్నఁడు లేని బెదరుమాటలు నీనోర నేఁడు క్రొత్తఁగా వినుచున్నాను.

ల: అట్లుగాదు. ఇది యొకదనుజుని మాయగ నుండునని నేను సందేహించుచున్నాను.

రా: తమ్ముఁడా! యొకదనుజునకై భయపడవలయునా!

చ॥ సకలజగమ్ము లొక్కట కనుసన్న జయింపఁగఁజాలు దోర్బలా
ధికుఁడనటంచు నన్నెఱిఁగి, దేవత లందఱు డాసినన్ లయాం
తకువలెఁ దాఁకి నీవు పటుదర్పముఁ జూపఁగలట్టి మేటివై,
యొకసురవైరిఁగూర్చి యిటు లూఱక సంశయ మొందఁబాడియే!

ల: అన్నా! చతుర్దశజగంబు లొక్కఁడై వచ్చినను నిన్నెదిరింపఁజాలవని నే నెఱుంగక పోలేదు. అయిన నొక్కఁడు విన్నవించెద. ఈవిపినము ఘోరరాత్రించరనివాసము. మన మిదివఱ కనేకుల యాతుధానులఁ దెగటార్చితిమి. ఆకారణమై మనయెడ వార లకుఁ గ్రోధ మగ్గలంబై యుండు. మఱియును మొన్న నీశస్త్రాగ్ని కింధనములైన ఖర దూషణాదిదానవు లొకరాక్షసేశ్వరుని సైన్యమున నొకభాగమునకు నాయకులనియు నారాక్షసేశ్వరుఁ డనంతమాయాబలసంపన్నుఁడనియుఁ వినియున్నాము. ఖరదూష ణాదుల సంహార మారక్షోవిభునకుఁ గ్రోధకారణమై యుండును. కావున దురాత్ము లగు దనుజులవలన మనము కడుంగడు జాగరూకత గలిగియుండవలయుననియే నా నిశ్చయము.

రా: లక్ష్మణా! నీయభిప్రాయము యోగ్యముగ నున్నది. నీచెప్పినట్లు ఖరాసురసంహారము నాఁటనుండియు మనము సహస్రాక్షులమై మెలంగవలయుననియే నాతలంపు. అయిన నీమృగముఁ దేఁబోవుటలో శంకింపవలసిన దేమున్నది! ఇది సామాన్యమృగమైన సజీవ ముగఁ బట్టితెచ్చెద. లేక మాయామృగమైన మదీయకఠోరాస్త్రమున కెరసేసి పూజ్యు లగు తాపసోత్తములకు ముదముఁ గూర్చెద. రెండువిధముల మనకు లాభమేకదా! అది యటులుండుఁగాక.

మ॥ పదమూఁడేదు లరణ్యవాసమున నీపద్మాక్షి తా నెట్టి యా
పదలన్ నాపయిఁ బ్రేమతోడనె తృణప్రాయమ్ముగా నెంచెఁగా;
కిది కష్టం బనుచుండెనే! తుదకు నేఁడీ నాతి కాంక్షించున
ట్టిది యల్పంబగు లేఁడి; దీని మన మెట్లే పట్టి యీఁజెల్లదే!

లక్ష్మణా! సీత కోరక కోరక యీకురంగశాబకమును గోరినది. జగదేకధనుర్ధరులగు మగఁడును, మఱందియు నుండి యీనాతి కోరిక వ్యర్థము కావచ్చునా!

ల: దేవా! యామహాజనని కోరిక వ్యర్థము కావలెనని నాయభిమతముకాదు. ఆదేవి కాం

క్షింపనేవలెఁగాక మూఁడులోకముల నెచ్చట నెట్టి దుస్సాధవస్తు వుండిన నిమిషార్థమునఁ దెచ్చి సమర్పించుకొననా! అల్పమగు నీ మృగ మెందుకు! న న్నాజ్ఞాపింపుము. ప్రచండకోదండధరుఁడనై చని చంద్రమండలమున నమృతముతోఁ బెఱిఁగియున్న హరిణముఁగాని సకలగీర్వాణసమూహసంసేవ్యుఁడగు ఫాలనేత్రుని హ స్తము నలంకరించియుండు ముద్దులేఁడినిగాని యరక్షణమునఁ బట్టితెచ్చెద.

రా: సౌమిత్రీ! నీ వెంతటి పనికైన శక్తిమంతుఁడవు. కాని యిపు డంతయేటికి! సీత యీ కురంగమును గోరఁగా నీమెయెడఁగల ప్రణయవశమున నే నా ముద్దు చెల్లించెదనంటిని. ఈయల్పమృగకారణమున నేదో మహాపద వచ్చునని నీవు శంకింపకుము. అట్లైనను టికిఁ గాకుండునుగాక. నీవు వేఱొండు పలుకక ధనుర్బాణముల నిట్లందిమ్ము.

ల: (పలుకక వినమ్రుఁడై ధనుర్బాణముల నిచ్చును.)

రా: (గ్రహించి)

గీ॥ పసిఁడిహరిణంబు నెట్లేనిఁ బట్టితెచ్చి। యీయ నేఁ బోవుచుంటిసుమ్మీ! కుమార!
పటుధనుర్ధారివగుచు నీవది నె నెప్పు। డేమఱకు మయ్య! వత్తు నే నింతలోన.
లక్ష్మణా! భద్రము. త్వరితముగ వచ్చి మిముఁ గలిసికొనియెద.

(నిష్క్రమించుచున్నాఁడు.)



ల: (స్వగతము.) వరాహపోతము వెంటనంటు నిటాలనేత్రునిచందమున రామదేవుఁడీమృగముపిఱుందఁ జనుచున్నాఁడు. (యోజించి) నామన స్సేటికో కలఁత నొందియున్నది. నన్ను సమాధానపఱచుటకై పరమశాంతముతో నెంతయోసేపు బోధించు రామచంద్రుఁడు నేఁడు నే నెన్నివిధముల విన్నవించుకొన్న నించుక తొందరతోడ నే పయనించుటయు నకాండమున నామాయాహరిణము తళుకుబెళుకుల నమ్మహాభాగుని వంచించి దూరము గొనిపోవుటయు దూరాలోచనాసమర్థమగు రామచంద్రుని దివ్యచిత్తమున కేమియు స్ఫురింపకుండుటయుఁ జూడ నేదో యొక యూహింపరాని యాపద రానున్నదని తోఁచెడి. ఇంతకు భవితవ్య మెట్లున్నదో! కానిమ్ము. భీకరశరచాపధారియగు రామున కెందును భయములేదు. నేనును జాగరూకుఁడనై సీతాదేవిని గాచియుండెద.

సీ: సౌమిత్రీ! యధిజ్యశరాసనుఁడై మీయన్న యామృగముపిఱుంద నెట్లు పరుగిడుచున్నాఁడో చూడుము. ఇఁక నొకయింతసేపటి కాయన మృగమును బట్టితెచ్చునుగదా!

ల: (రాముని పోయిన దెసనే చూచుచు) తేవచ్చును.

సీ: లక్ష్మణా! యామృగ మెంతలాఘవము గలది! భర్తచేఁ బట్టువడక తప్పించుకొని పొదల మాటున కేగె. అయ్యో! మీయన్న కామృగము దొరకకపోవునా!

ల: (అల్లే చూచుచు) దొరకవచ్చును.

సీ: లక్ష్మణా! యేటి కంత సందేహముతోఁ జెప్పుచున్నావు! ధానుష్కశిరోమణియగు రామచంద్రుఁడు పనిపూని వెంబడించియుండ నా కురంగము పట్టువడకపోవుట యెట్లు!

ల: (అల్లే చూచుచు) పట్టువడినఁ బడవచ్చును.

సీ: అన్నా! నేఁడేమి యీచిత్రవిధము! నిత్యసంతోషివగు నీమోమున నేఁడేటికో చింతారేఖలు గన్పట్టుచున్నవి. నీహృదయమున కేదేని విచారము తోఁచినదా! ఎట్టి విపత్సమయములనైనఁ జింతనొంది యెఱుంగవే. నేఁడేటి కీవిచారభారము!

ల: అమ్మా! సుమిత్రాదశరథులకన్న మిన్నగ నీవును రామచంద్రుఁడును బ్రేమతోఁ జూచుచుండ నా కీఁకఁ జింతయనునది యెట్లు కలుగనేర్చును!

సీ: మఱి నీ వేల దృష్టిమార్పక యొకేదిక్కు దీనముగఁ జూచుచున్నావు!

ల: రామచంద్రుఁడు వెళ్లిన మార్గమునఁ జూచుచుంటిని. కాని యన్యముగాదు.

సీ: ఇప్పు డేటికోగాని

చ॥ మనమునఁ జేయివెట్టి పలుమాఱు కలంచినయట్లు చెప్పఁగా
నను వొకయింత లేని హృదయవ్యథ పైకొనుచుండెఁ దమ్ముఁడా!
ల: వనటఁ గలంగకమ్మ! ఘనబాహుబలుండగు రామచంద్రుఁ డా
య్యన హరిణంబుఁదెచ్చి నిను హర్షమునొందఁగఁజేయు నమ్మరో!

(నేపథ్యమున హాలక్ష్మణా! యని ధ్వనియగును.)

సీ: (నివ్వెఱపడి) లక్ష్మణా! యేమిది! రామచంద్రుఁడెందేని ఘోరాపద నొందెఁ గాఁబోలు. ఎలుంగెత్తి నిన్నుఁ బిలుచుచున్నాఁడు. అకటా! మఱల నేను నాథునిఁ జూడఁగలనో లేనో! తమ్ముఁడా! యేమి కీడు పైఁబడనున్నదో!

ల: అమ్మా! మాయావియై మృగరూపము ధరించిన దానవుని పిలుపుసవ్వడిగాని మాయన్న పిలుపుగాదు. భయపడకుము.

సీ: నాకట్లుతోఁపలేదు. ఒరులైన "లక్ష్మణా!" యని నిన్నేల పిలుతురు! అది తప్పక రామదేవుని పిలుపుగనే యున్నది. పర్ణశాలనుండి దూరము వెళ్లినపుడు ఘోరరాక్షసులు పొంచి యామహానుభావుని బాధించియుందురు. లేకున్న నింతబిగ్గరగా నింతదీనముగఁ బిలిచి యుండఁడు.

ల: తల్లీ! రామచంద్రుని దుర్వారపరాక్రమముఁగూర్చి తొలుతటినుండి యెఱింగియుండియు నింకను సందేహించెదవేల!

క॥ లోకము లన్నిటఁగలిగిన। రాకాసులపిండు సంగరమున నెదిరినన్
జీకాకొందఁగఁజేయును। గాకుత్థ్సున కెట్టిభయము గలుగదు జననీ!

సీ: అయ్యో! నా కావంతయు శాంతము కుదురకున్నది. హృదయము పరిపరివిధములఁ గలఁతనొందుచున్నది.

మ॥ అకటా! నాహృదయేశుఁడున్ దనుజమాయావాగురన్ జిక్కి కొం
డొకసాహాయ్యములేక ని న్బిలిచె రమ్మో లక్ష్మణా! యంచు; న
య్యకలంకాత్మకుఁ డెట్టికష్టములపాలై యుండెనో! శాతసా
యకచాపంబులు దాల్చి నీ వరుగవే యత్యంతశీఘ్రమ్మునన్.

ల: అమ్మా! యేల యూఱక శంకనొంది భయమును బెంచుకొనెదవు! ధానుష్కపట్టభద్రుఁడగు రామచంద్రుఁడు తుచ్ఛులగు దానవుల కెన్నడైనఁ జిక్కునా! ఆశూరకంఠీరవున కితరులు సాయముచేయువారా!

ఉ॥ నిండవె చీకటుల్ జగమునిండ! నభం బది వ్రీలిపోదె! మా
ర్తాండుఁడు తప్పఁబాఱఁడె! సుధానిధి వ్రక్కలుగాఁడె! తారకా
మండలి డుల్లఁగాదె! నృపమాన్యుని రాము మహానుభావు డై
త్యుండొకఁ డెట్లు మార్కొని మదోద్ధతిఁ జూపఁగనేర్చుఁ దల్లిరో!

అమ్మా! నీవు సందేహము మానుము.

సీ: లక్ష్మణా! నీవాక్యము జగదభినందనీయమగు రామచంద్రుని పరాక్రమమును గీర్తించుచున్నదేకాని చింతాక్రాంతమై పరిపరిగతులఁ బోవుచున్న నాహృదయమునకుమాత్రము శాంతి నొసంగఁజాలకున్నది. రామచంద్రుఁడు జగదేకధనుర్ధరుఁడు గావచ్చును. కాని మాయావులగు ప్రబలరాక్షసులుచేరి తాఁకిన నతఁ డేమిచేయఁగలఁడు! దీని కింత వితర్కమేటికి! "లక్ష్మణా" యని యెలుఁ గెత్తి పిలిచెనే! ఇంకను సందేహించెదవా! అయ్యో! యాధ్వని విన్నంతనుండియు నాప్రాణ ముండునట్లులేదు.

ల: అమ్మా! యది ముమ్మాటికిని మాయన్నకంఠధ్వని గాదు. రాముని దుర్వారపరాక్రమము నెఱుంగమి నట్లు శంకించుచుంటివేకాని యమ్మహాత్ముఁడు కనుసన్న నీరేడులోకముల భస్మీభూతము సేయఁగలఁడు. లోకాతీతవిక్రముఁడగు రామచంద్రుని దర్శనమాత్రమున రక్షోమండలములెల్ల గుండియ లవిసి తెగఁబాఱును. విశాలకాంతార

ములఁ గాల్చివైచు దవానలముపై శలభములు మూఁగునే! హర్యక్షరాజముపై మృగశాబకము లెత్తిరాఁగలవే! తల్లీ! నాగురుఁడగు రాముఁడెప్పుడును బరులచేఁ జిక్కఁడు. నీవు చింత దక్కియుండుము.

సీ: అయ్యో! నాహృదయవ్యథ నెంతదీనముగఁ జెప్పుకొన్నను నీమనస్సున కెక్కలేదు. నేను వేఁడుకొనుకొలఁదిని బ్రత్యుత్తరశతంబు లొసంగుచుంటివేకాని చిక్కువడియున్న యన్నకు సాయ మొనరింపఁ బోవైతివి. భువనమోహనమంగళమూర్తియగు రామచంద్రుఁడు సస్మితముఖాబ్జుఁడై సమీపమున నున్నంతవఱ కీజీవితము జీవితముగాని యట్లుకానినాఁ డీదేహ మరక్షణమైన నిలువదు. అన్నన్నా! ప్రాణాధికుఁడగు రఘూత్తమున కాపద వాటిల్లినవేళ నిన్నెన్నివిధముల బోధించి కడకు బాధించి వేఁడుకొన్న నావంతయేని సరకుసేయక వ్యర్థభాషణములు పెంచి యాలస్యము చేయుచున్నావు. నిశ్చయముగ నీహృదయ మిట్లు వజ్రకఠినమని యేనాఁ డెఱుంగ. అయ్యో! లక్ష్మణా! భరతుఁడు రాజ్యముఁ గైకొనియె. నీవు "సోదరుఁడు రాక్షసులచేఁ జావనీ లె"మ్మని యున్నావుకాఁబోలు. నిన్నెట్లు నమ్మవచ్చును!

ల: అమ్మా! నీశంకలన్నియుఁ గోపముగఁ బరిణమించుచున్నవి. ఈదిన మామృగము కనఁబడినది మొదలు నాహృదయము సందేహమునే వహించియున్నది. ఆఱు నూఱగుఁగాక. నూ ఱాఱగుఁగాక. అది కేవలహరిణము గాదు. కపటమనస్కుఁడైన యొకానొకరాక్షసుఁడు గైకొనిన మాయాస్వరూపము. జననీ! స్త్రీజనసాధారణమగు కోరిక పెంపున నద్దానినిఁ దెచ్చియిమ్మని రాఘవుని నీవు నిర్బంధించితివి. తోఁచినవిధమున, శక్తికిఁ దగ్గయట్లు, వినయమున, నామృగమువెంటఁ బోకుమని నేను రామచంద్రునితో విన్నవించుకొంటిని. త్రికాలజ్ఞుఁడగు రామచంద్రుఁడు నేఁడేటికో పౌర్వాపర్యములు విచారింపక తొందరపడి యద్దానిని వెంబడించెను. సజీవముగ నామృగము పట్టువడ సందున రామచంద్రుఁడు దానిపై శరముఁ బ్రయోగించియుండును. అవసానసమయమున నామృగము "హా లక్ష్మణా!" యని యెలుఁగెత్తి యఱచియుండును. ఆధ్వని రాముని కంఠధ్వనియని నీవు పొరబడి నమ్మియున్నావు. సాయముగఁ బొమ్మని నన్నుఁ దొందరపెట్టుచున్నావు. శాంతము చాలక కఠినోక్తులకు నన్ను గుఱిచేయుచున్నావు. అమ్మా! నీ వెన్ని కఠినోక్తులు పలికినను నాకర్తవ్యమునుమాత్రము నేను శిరసావహించి నెఱవేర్పవలెను. లక్ష్మణుఁడు వజ్రహృదయుఁడయిన నంతకన్నఁ గఠినుండయినఁ గావచ్చునుగాని యొక్కక్షణకాలము తొందరపడి రామాజ్ఞ నుల్లంఘించువాఁడు మాత్రము కాఁజాలఁడు. కుటిలరాక్షసభయంకరమగు నీమహారణ్యమున ని

న్నింటి విడిచిపోయిన నెట్టిప్రమాదమైన జరగవచ్చును. అప్పు డన్నకు నేనుత్తర మిచ్చుకోఁజాల. తల్లీ! రాము నానతి నా కనుల్లంఘనీయము. రాముఁ డాజ్ఞాపించెను. నేను కావలియుండెదను. ఆయనమాటకు విధేయుఁడ నగుటతప్ప నా కొండేమియుఁ దెలియను. పలుమాట లేల! రామచంద్రుఁడేవచ్చి యాజ్ఞాపించుదనుక నేను ని న్నింటివిడిచి యొక్కయడుగైనఁ నవ్వలికి జరగను.

(అని పెడమోమున నిలుచుచున్నాఁడు.)

సీ: ఛీ! దుర్బుద్ధీ! నీవు నిక్కముగఁ గటికవాఁడవే! నిమిషనిమిషమునకు నీమూర్ఖత హెచ్చుచున్నది.దశరథునకన్న నెక్కుడు ప్రేమతోఁ జూచు రామచంద్రునకు ఘోరవిపత్తు ప్రాప్తింపఁగా మనంబున నించుకేనియు జడియవు. సుమిత్రాదేవికన్న వాత్సల్యముతో నినుఁ జూచు నేను రాముని బాసినకతమున బహుళచింతాక్లేశమునఁ గుంది యెంత ప్రార్థించినను మూర్ఖ్యము విడువవు. అనుంగుఁదమ్ముఁడనియు సంగరక్షకుఁడనియు రామచంద్రుఁడును, తమ్ముఁడవైన మఱఁదివైన నీవేయని యెంచి నేనును, మేమిరు వురమును నిన్ను మావెంటఁగొనివచ్చి యొంతయు మోసపోయితిమి. "దాయాదుల నమ్మరా"దను నార్యోక్తి మిథ్యకాదయ్యెఁగదా! నీయట్టివారల నెందఱనో చూచి వా రట్లు నిశ్చయించియుందురు. కటకటా! నీవు మాకుఁ దలగడక్రింది పామైతివే!

గీ॥ భరతుఁ డక్కట! రాజ్యవైభవముఁ గొనియె; నీవు దనుజులచే భర్త చావఁగోరి
యుంటి; విపుడు నాకనికాచియుంటివేమొ! ప్రాణముఁ ద్యజింతు; నిన్నుఁ జేపట్టఁగలనె!

రామచంద్రునిమృతి విని నాయెడ నేదేనిఁజెడుతలంపున నున్నావుకాఁబోలు. దుర్హృదయా! శ్రీరామునకు నేను విధేయధర్మపత్నిని. నే నిక్లే నిలుపునీరయిపోదునే గాక నీకలుషమునకు లోనగుదునా! ఛీ! నీముఖముఁ జూచినఁ బాపము తటస్థించును. నాసముఖమున నుండకుము. తొలఁగుము.

ల: (చెవులు మూసికొని) జగమునంతటిని మ్రింగు పెద్దపిడుగు పడియె. అకటా! నేను లక్ష్మణుఁడనేనా! ఈమె నాజనని సీతామహాదేవియేనా! అయ్యో! చూచుచుండఁగనే నాతల్లికి నాయం దెంతటి యనుమానము గలిగినది! ఛీ! నాజన్మ మెంత కలుషభాజనమైనది! సాధ్యమైనంతవఱకు వినయమున నీమెకు బోధించితిని. కాని యీామె మానసమునకు శాంతము గలుగలేదు. తననాథునకుఁ గీడు తలంచితినని మర్మభేదకములగు వాక్యములచే నొప్పించుచున్న యీామె యెదుర నిక్కముగ నొకక్షణమైన నిలువఁజాల. "సీత నేల యొంటివిడిచి వచ్చితి"వని రామచంద్రుఁడు న న్నాగ్రహించుననికదా! ఆగ్ర

హింప నిమ్ము.శపింప నిమ్ము. మహాభీమమైన తనధనువున నిశాతబాణమును సంధించి నాతలఁ దెగవ్రేయ నిమ్ము. ఈమానినీతిలకము పలుకు కఠోరవాక్యములకన్న శ్రీరాముని శరములు తీక్ష్ణములును హృదయభేదకములును గాఁజాలవు. కావున నే నిప్పుడు రామాజ్ఞ మీఱియైన నీమెను వదలిపోయెదను. (ప్రకాశముగా) తల్లీ! నే నెట్టి నిర్భాగ్యుఁడనో కాని నేఁడు నీనోర నిట్టి పాపఁపువచనములు వింటిని. తొలుత మీయిరువుర వనవాసమునకై పరితపించి వాఁడి వాఁడి నిస్సారమైన నాహృదయమునకు విమలిప్తములగు నిశాతబాణములకన్నఁ దీక్ష్ణములగు నీమాటలు మఱింత నొప్పిని గలిగించుచున్నవి జననీ! పదనుగల చిన్నకత్తులను లక్షోపలక్షలు నా నాడులయందుఁ గ్రుచ్చియున్నను నేను సహించియుందును. క్రూరవిషభీకరములగు కాలవృశ్చికములఁ గొట్లకొలఁది దెచ్చి నాదేహమునందంతయు విడువక కఱపించియున్నను వెనుదీసియుండను. చలచలనిక్రాఁగు తైలకటాహమున నను ముంచియున్నను నేను జంకి యుండను. మిగులభారముగలిగి వాఁడిగల గొడ్డంద్రతో నాశిరము పరియలు పరియలుగఁ బగులఁ గొట్టించియున్న నే నోర్చుకొనియుందును. ప్రచండమగు నొకమహాగండశిలను దెచ్చి నాదేహమునఁ బ్రతిభాగమును గ్రమక్రమముగ నుగ్గునుగ్గగునట్లు దినములకొలందిని బ్రాణముమాత్రము పోకుండునట్లును బాధమాత్రము మిక్కుటముగ నుండునట్లును నన్ను నలుగదంపించియున్నను సమ్మతించి నిలిచియుందును. నిగనిగలాడు నెత్తునిప్పులను గొప్పకుప్పగఁ బోసి తన్మధ్యమున నాదేహము నుంచి పుటము వేసియున్నను నేను నిలిచియుందును. ఒక్కొ_కఁడు జగత్తునంతటిని నాశముఁ జేయఁజాలు పిడుగులు వేనవేలు నాశిరమునఁ గురియించియున్నను నేను భయపడియుండను. చటచట ధ్వనులతోఁ బైకొనివచ్చు దావానలమున నన్నాహుతిగా నిచ్చియున్నను నిర్భయముగ నిలిచియుందును. గగనోన్నతమైన యొకమహాపర్వతశిఖరమునకు నన్నుఁ గొనిపోయి తుద కొక చిన్నశల్యఖండమైన దొరకకుండున ట్లాపర్వతాగ్రమునుండి భూతలమునకు నన్నుఁ దలక్రిందుగఁ ద్రోయించియున్నను ధైర్యము వీడియుండను. నాశరీరమందలి శల్యములును మాంసమును మేదస్సును దుత్తునియలై ధూమ్రమువలె లేచి యనంతప్రచండవాతావరణమునఁ గలియునట్లు నా విశాలవక్షోభాగమున కెదురుగ మహాశతఘ్ని నొకదానిని నిలిపి పేల్పించియున్నను నేను కనుఱెప్పనైనఁ గొట్టియుండను. కాని తల్లీ! మహాశనికఠోరములయిన నీమాటలు నన్ను సజీవముగఁ గాల్చుచున్నవి. జననీ! యయోధ్యలోనుండు కాలమునసేగాక యీయరణ్యములలో వసించు నీపదమూఁడువత్సరములనుండియు నావిశుద్ధాంతఃకరణమును జక్కఁగ నెఱిఁగి యెఱిఁగి

నీ విట్లాడిన నే నేమనఁగలవాఁడ! అమ్మా! తల్లియే కుమారునిఁ దప్పుఁదలంచిన నిఁక లోకములోనివా రేమనవలయు! జననీ! నీవు మాతృదైవంబవని భావించుచుందునే! ప్రత్యహమును ముప్ప్రొద్దును నీకు నమస్కరించు వేళలలో నాకన్నులు నీపాదార విందముల నేకాని నీముఖారవిందము నెన్నఁడైనఁ జూడఁ బ్రయత్నింపవని నీకుఁ దెలి యదా! అమ్మా! హృదయము శరీరాంతస్థితంబగుటఁజేసి విప్పి చూపరాక యున్నది. తల్లీ! నాహృదయము నిష్కలుషము. పదునాలుగుభువనములకుఁ దల్లివిగ నుండఁదగిన నీవంటి యుదారసౌజన్యశీల నావంటి విధేయసేవకుని దప్పుఁదలంచెననిమాత్రము నాకు విచారము మిక్కుటముగఁ గలుగుచున్నది. తల్లీ! లక్ష్మణుఁడు గురుభక్తుఁడో గురుద్రోహియో యీజగం బెఱుంగును. దివారాత్రములును సూర్యచంద్రులును సంధ్యలును దారకలును వనదేవతలును బంచమహాభూతములును దివ్యర్షులును నావిశు ద్ధహృదయమునకు సాక్షులుగ నుండకపోరు. నీ వనరాని పలుకులు పలికితివని విచారము నొందుటతప్ప తల్లీ! నీయెడ నా కించుకయుఁ గోపము లేదు. నీ వట్లంటివని కడకు నాభ్రాతయు గురుండును నగు రామచంద్రునకైనఁ జెప్పను. నీ విప్పు డనిన యీ ఘోరకలుషవచనములను నే నొక్కండనే వింటిని. అయ్యవి నాతోడనే పోవలయును గాక. రెండవవాని చెవిఁబడవైచి సీతామహాదేవి తనమఱఁదిని దప్పుఁదలంచినదని యాచంద్రార్కము నిను నిందింపఁజేయుట నా కభిమతము గాదు. జననీ! నీయాజ్ఞ ననుసరించి నేను వెడలెదను. నీ కెట్టి యాపదయు గాకుండఁ గాపాడుమని సర్వేశ్వ రుని నాసంపూర్ణహృదయమునఁ బ్రార్థించెదను. తల్లీ! రామచంద్రునిగూడి త్వరితముగ వచ్చి నిన్ను దర్శించు భాగ్యము గలుగునట్లు నన్నాశీర్వదింపుము. (నమస్కరించి, లేచి)

సీ॥ నియమవృత్తిఁ దపంబు నెఱపు చక్రాంతంబు శాంతులైన మహర్షిచంద్రులార!
పవలు రేల్ దివినుండి ప్రజల మంచియుఁజెడ్డ సకలంబు గను సూర్య చంద్రులార!
క్షణమైన నేమఱక జగజ్జనాళి వృత్తముఁ జూచు పంచభూతంబులార!
మాశుభ మ్మనయంబు మనమునఁ గోరు చుట్టమ్ములౌ వనదైవతమ్ములార!
గీ॥ నేను పోవుచునుంటి మహానుభావుఁ డైన శ్రీరామచంద్రు సాయంబుఁబూని;
యీమహాదేవి సీత శ్రీరాముపత్ని! యేకతమయుండు; దయనువహింపరయ్య!
(నిష్క్రమించు చున్నాఁడు.)

సీ: లక్ష్మణుఁడు వెళ్లుటఁ జూచి సంతోషమునకుమాఱు నా కేటికో విచారము గలుగు చున్నది. ఎన్నఁడులేని విధమున నించుక తొందరపడి యనరానిమాట లని యతని హృదయమును జాల నొప్పించితిని. పాపము. సౌజన్యనిధియగు లక్ష్మణుఁడు పల్లెత్తు

మాటయైన నాడక గ్రుడ్డులనీరు గ్రుక్కుకొనుచు రామచంద్రుఁ డున్నదెసకై పయనించె. అతఁడు కడపట నాడిన మాట యిప్పటికిని నామనస్సున నుదలుచున్నది. లో నెంత నొప్పిపడెనోకాని, కడకు నే నన్న కఠినోక్తులు తనగురుండగు రామదేవునకైన నెఱింగింపనని వచించె. నాకు సాష్టాంగనమస్కార మాచరించె. దైవములఁ బ్రార్థించె. నా పాదములదెస నొక్కక్షణకాలము చూడ్కి నిలిపి యిచ్చోటు విడిచె. అయ్యో! పదమూఁడువత్సరములుగా నన్నుఁ దల్లినట్లు భావించి యుపచరించిన సుచరిత్రుఁడు. మనసు మెత్తన. ఒక్కమాటయుఁ గటువుగ నాడలేఁడు. నా ప్రాణేశ్వరుని నన్ను సేవించుటకై జననిని జాయను సర్వసంపదలను బరిత్యజించి వలచి వలచి కష్టములఁ దలవైచుకొని వచ్చి నిద్రాహారములుమాని మమ్ముఁ గొలిచిన స్వామిభక్తిపరాయణుఁడు. ఏమి చెడుకాలమోకాని పర్వతాగ్రము విడిచిన గండశిలలవలె నేఁడు నానోరఁ గఠినోక్తులు పరంపరగా వెలువడినవి. అకటా! సౌజన్యదేవతయగు సౌమిత్రిని సాంద్రారణ్యములకుఁ ద్రోలితిని. మనోవల్లభు నంతకుముందె యడవులపాలు చేసితిని. ఈదినము నా కేమి విపత్తు మూఁడనున్నదో!

సీ॥ నానాథుఁగూడి వనంబులఁదిరుగ నాయెడకుఁ జిత్రకురంగ మేల వచ్చె!
వచ్చెఁగాక యుపేక్షవహియింపక ద్దానిఁ బాలించుబుద్ధి నా కేల గలిగెఁ!
గలిగెఁగాకది నాథుఁగాంక్షింపఁ గాదనకేదానిఁ బట్టితే నేల చనియెఁ!
జనెఁగాక శరముల సమయించి కొనిరాక యిందాకఁ గానలో నేల మసలె!
గీ॥ మసలెఁగాక హృదీశుఁ డాపసిఁడిలేఁడి। దీసికొనిరాఁడె యంచుఁ జింతించుచుండ
నక్కటక్కట! హా! లక్ష్మణా! యటంచుఁ। దీవ్రమగు నార్తరావ మేతేర నేల!

అకటా! రామచంద్రుఁడింకను సేమముతో నుండునా! ఆపాపిమృగ మాయన నెంత దవ్వుగఁ దీసికొనిపోయియుండునో! రామచంద్రుఁ డేగినత్రోవ లక్ష్మణుఁ డెఱింగెనో లేక నడుమ బడలుచున్నాఁడో! నేనిచ్చట నొంటినుందునని నాథునకుఁ దెలిసియుండునా! ఏల వారింకను రాకున్నారు! అకటా! పూర్వపరిచితములయ్యు నీవనములోని వృక్షములును విహంగమధ్వనులును నాకిప్పు డెంతయు భీతిని గొలుపుచున్నవి. ఏటికో యాపొద మిక్కిలి కదలుచున్నది!

ప్రవేశము—రావణుఁడు.

అదిగో సీత యెదుటనే ప్రత్యక్షమయినది. ఔరా! యేమి యీమందయాన సౌందర్యము! లావణ్యనిధానమై ముద్దులొలుకు నీలలనామణి ముఖము కార్తికరాకాశశాంకబింబమునకు విద్యాగురు వగుఁగదా! మనోహరములై విశాలములైన శృంగార

ధవళనేత్రములనుండి వెడలెడు వీక్షణమాలికలు మన్మథుని నీలోత్పలబాణపంక్తులకు వియ్యంబులై యొప్పుచున్నవి. ఏమి యానడక యందము! పుష్పరాశివలెఁ గోమలత్వమును సౌందర్యమును గూర్చుచున్న యీకాంత నెట్లైన నాకాంతగఁ జేసికోవలెను. నాయొద్దనున్న దేవతాస్త్రీలు నప్సరోగణములును గంధర్వకిన్నరాంగనలును మండోదర్యాదిదైత్యయోషామణు లీమె కాలిగోటికైన సవతురారు. ఆహా! సకలభోగభాగ్యములతో సతీసుతులతో బంధుమిత్రులతో సకలదైతేయసామ్రాజ్యముతో నాలంకాపురసర్వస్వమును నేనును నాశమయి పాథోనిధిని గలియుదుముగాక. ఇక్కలికి నొక్కమాఱు ప్రక్క నిలిపికొనినఁ జతుర్దశభువనాధిపత్యము లభించినట్లు సంతోషింతునుగదా!

సీ: స్వగతము) ఎవ్వరో మునీంద్రుఁడు వచ్చుచున్నాఁడు. ఏలొకో యితనిదర్శనమున నాభీతి యెక్కుడగుచున్నది. (ప్రకాశము)మహాత్మా! నమస్కారము.

రావ: నారాయణ.

సీ: స్వామీ! కూర్చుండుఁడు. (అని యొక దర్భాసనముఁ జూపుచున్నది.)

రావ: కూర్చుండెదను.

సీ: ఈజలమునఁ బాదప్రక్షాళనము చేసికొనుఁడు. (అని నీరము నిచ్చుచున్నది.)

రావ: నారాయణ.

క॥ తొయ్యలి! యెవ్వనికూతుర! వెయ్యది నీకులము! నామ మెయ్యది! నగరం
బెయ్యది! యడవికి రాఁ గత మెయ్యది! నీచరిత మింక నెయ్యది! చెపుమా!

సీ: మహాత్మా! నాచరితము కోమలమగు మీహృదయమునకు విచారముఁగూర్చునని శంకించుచున్నాను.

క॥ జనకుని కూతుర; దశరథు జనపతి కోడలను; రామచంద్రుని భార్యన్;
నను సీతయండ్రు; మాపురము నయోధ్య; సమస్తభువనపూతచరిత్రా!

పితృవాక్యమునకై నామనోహరుఁడు పదునాలుగేం డ్లరణ్యావాసము చేయరాఁగా నేనును నామఱఁది లక్ష్మణుఁ డాయన వెంట వచ్చితిమి. ఎన్నియో కష్టములు పడుచుఁ బదమూఁడువత్సరములు గడపితిమి.

రావ: దశరథుని నేను చక్కఁగా నెఱుఁగుదును. మీవృత్తముగూడ ననేకపర్యాయములు వినియున్నాను. (స్వగతము) నాసందేహము తీఱినది. ఈమెయే సీతయని దృఢపడినది. ఇఁక నాకార్యము సాగింపవచ్చును.

(సీత లోనికి వెళ్లివచ్చి,)

మహాత్మా! ఈఫలముల నారగింపుము. దూరపథిశ్రమమున బడలియుందురు. ఇంచుక విశ్రమింపుఁడు.

రావ: తరుణీ! నీమహాదరము వేయిసత్కారములకన్న నెక్కుడు సంతోషము నాకొసంగుచున్నది. మిగుల భక్తిశ్రద్ధలతోఁ దియ్యని పలుకులతో నన్నెంతయు నలరించితివి. ఇంతకు మించిన సత్కారము లే ముండును!

సీ: మునీంద్రా! యొరు లెంతటి స్వల్పకార్య మొనరించినను మిక్కిలి ఘనకార్య మని భావించి సంతోషించుట మీవంటి గొప్పవారికి నైజము. నీ కెట్లుపచరింపఁగలనో తోఁపదు.

రావ: (స్వగతము) ఆహా! యీయువతీలలామ సౌందర్యమునకన్నను వినయవిధేయతలు మఱింత హృదయాకర్షకములుగ నున్నవి. ఇట్టి యసమానలావణ్యవతి యింతటి వినయవిధేయతలతో నిట్టి మధురభాషణములతో నాదరించి సపర్యలుచేయు భాగ్యమున కొకనిమిషమైనఁ బాత్రుఁడైనవాఁడు ధన్యతములలో ధన్యతముఁడు. ఈసుందరాంగి ముఖారవిందసౌందర్యమునకుఁ జిఱునవ్వువెన్నెలలకు వాలారుఁజూపులకు ముద్దుపలుకులకు నోయారఁపుఁజెయ్వులకు మైమఱచి చిరతరానందము నొందు నారాముఁ డెట్టిమహాపుణ్యసంపన్నుఁడు! ఆరామునియెడఁ గోపమేగాక నా కిప్పు డీర్ష్యయుఁ గలుగుచున్నది. కానిమ్ము. ఈకాంత నెట్లైన వానికి దక్కనీయను. (ప్రకాశము) వనితా! నాకిప్పు డేయుపచారమును వలదు. నీమగఁడును మఱఁదియు నున్నా రంటివే. వా రేరీ! ఎచ్చట నున్నారు!

సీ: ఈదిన ముదయమున నీపర్ణశాలాపరిసరమున విహరించుచుండగా నొక కనకమృగము గనఁబడినది. దానిని బట్టితెమ్మని నానాథుని వేఁడితిని. ఆమహాభుజుఁ డద్దాని వెంటఁ బోయి యొంతసేపటికిని రానందునఁ బాగిలి వెదకి తోడితెమ్మని నామఱఁదిని, లక్ష్మణుని బంపితిని. వారు నిప్పుడే వచ్చుచుందురు.

రావ: (స్వగతము) భళా! మిత్రమా! మారీచా! కార్యము నెంతచక్కఁగ నెఱవేర్చియున్నావు! (ప్రకాశము.) సుందరీ! యేమైన నీవనవాసాయాసము మీకుఁ గలుగవలసినది కాదు. అందునను శిరీషపేశల మగు నీతనూవల్లి కఠోరవనవాసక్లేశమును సహింపఁగలదా!

సీ॥ చండార్కుఁ డంతరిక్షమహాపథంబునఁ జెలరేఁగి యగ్ని వర్షించునపుడు,
వడిరేఁగి సుడిగాలి వసుధాపరాగంబు వెదచల్లి యుద్వృత్తి వీచునపుడు,

చటచటధ్వనుల నెచ్చటఁ దాన నై చుట్టుకొని దావవహ్ని పైకొన్నయపుడు,
గుహలు మాఱ్మ్రోఁగియ నాక్రోశించు మృగపాళి ఘీంకారముల నాలకించునపుడు,

గీ॥ నెంత కలగుండువడితివో! యెట్టికష్ట ములకు లోనైతివో! యెంత యులికి పడితొ!
కటకటా! యంబుజాస్య! యిక్కాన నీకు నెట్టి యిడుమల విధియించెనే విధాత!

లావణ్యవతీ! లేత లై యరుణము లైన లేమావిచివుళ్లకన్నఁ గోమలము లీ నీ పాదములు! ఇట్టి సుకుమారాంగి వానవములలో నెట్లు సంచరించితివి!

గీ॥ మంచిపూదండ నలుగంగ దంచునట్లు! మాలతీలత నెండలో మాడ్చునట్లు!
పల్లవముల నగ్నిని బడవైచునట్లు! నిన్ను వనులకుఁ దెచ్చు టో నిరుపమాంగి!

సీతా! యాఘాందసబ్రహ్మ నీ కెట్టి కష్టములు గలిగించినాఁడు! అతని కన్న నీ నాథుఁడో మఱింత శిలాహృదయుఁడు.

సీ: మునిచంద్రా! నానాథుఁ డరణ్యమునకు ర మ్మని నన్ను నిర్బంధించియుండలేదు. ఆయన నెంతయో వేఁడుకొని నేనె వెంట వచ్చితిని. మహాత్మా! ప్రొ ద్దెక్కుచున్నది. రామలక్ష్మణు లిప్పుడే వచ్చెదరు. ఆతిథ్యము సిద్ధముచేసెద.

రావ: వలదు. కొంచెము తాళుము. ఆయాతిథ్యముతో నా కిప్పు డవసరము లేదు.

ఆ॥ ప్రక్కఁజేరి నీవు వాలారుఁజూపులఁ। బఱపి యొక్క పలుకు పలికితేనిఁ
జాన! సకలలోకసామ్రాజ్య మనుభవిం। చినవిధాన సుఖముఁ జెంద నేర్తు.

కామినీ! కొండొకసేపు నాయండ నుండి నీవాలుఁజూపుల నాపైఁబరపి నా హృదయమునకు సంతోషముఁ గలిగింపుము. నా కదియ చాలును. నే నాతిథ్యముకొఱకు వచ్చినవాఁడను గాను.

సీ: అయ్యా! నీవు వేఱుభావముతో నున్న ట్లున్నది. నీవేషమునకును భాషణమునకును మిక్కిలి వ్యత్యాసము కనఁబడుచున్నది. నీవు నిక్కపుఁదాపసుఁడవా! లేక మాయావేషమును ధరించి వచ్చిన రాక్షసుఁడవా!

రావ: (చిఱునగవుతో) చల్లకు వచ్చి ముంత దాఁచినట్లు నీకడ నావృత్తాంత మెఱిఁగింపక పోయిన నేమి ప్రయోజనము! పరమసంతోషముతో నన్ను నీ కెఱిఁగించుకొనెద. అవశ్యము వినుము.

ఉ॥ తాత విధాత; తండ్రి గుణధన్యుఁడు విశ్రవసుండు; లోకవి
ఖ్యాతము లంక కాపుర; మనంతబలాఢ్యులు దానవుల్ పదా

జ్ఞాతముఁ గొల్చు దాసులు; ప్రచండపరాక్రమధాటి నీజగ
ద్వ్రాతములన్ జయించితిని; రావణుఁ డందురు నన్ను సుందరీ!

తన్వీ! నాచెలియలు శూర్పణఖ నీ నిరుపమానసౌందర్యముఁగూర్చి చెప్పి నప్పటి నుండియుఁ బట్టరాని తమకమ్మున ని న్నెప్పుడు చూతునో యని యువ్విళులూరితిని. ఇప్పుడు నిన్ను సమీపించితిని. పంచశర శరాసన పరిముక్త నిశాత శర పరంపరలకన్నఁ దీక్ష్ణములగు నీకటాక్షమాలికలు నాహృదయమును వ్రయ్యలుచేసి నన్ను నీపాదము లపైఁ ద్రోయుచున్నవి. (పడి) న న్ననుగ్రహించి నీదాసునిగ నేలుకొనుము.

సీ: దుర్హృదయా! దూరము పొమ్ము. చూచుచుండగనే యెంతటిమోసమునకుఁ బాల్పడి తివి! పూజ్యమగు బ్రహ్మవంశజుఁడవయ్యు నీ కున్నతగుణములు గలుగ వద్యోఁగా! ఇప్పు డంతయు స్ఫురణకు వచ్చుచున్నది. మాయామృగకారణమున నాథు నరణ్యమధ్య మునకుఁ బంపి నే నొంటినుండు సమయమువేచి తాపసుఁడను భ్రాంతి గలిగించి వచ్చి యిట్టి కలుషవాక్యము లాడుచున్నావు. పతివ్రతలఁ జెనకుట తల నఱకికొనుటయే సుమా! ఛీ! నీ వెంత ధర్మహీనుఁడవు! పాపాత్మా! తొలఁగుము.

రావ: వనితా! యేల తొందరపడెదవు!

గీ॥ కడుపునిండుగఁ గుడుచుచుఁ గంటి కింపు యిన చెలుల బల్మినేనియు నేలవలయు
ననెడి ధర్మంబె కాని చంద్రాస్య! వేఱు ధర్మములు లేవు దైత్యసంతతుల కెందు.

సీతా! నేను లక్షోపలక్షల స్త్రీలతో మెలంగినవాఁడను. స్త్రీవిషయకమైన శృంగారశాఖలో నావలె ననుభవముగల రసికుఁ డుండఁడు. అది యటు లుండనిమ్ము. సుర గరు డోరగ కింపురుష యక్ష సాధ్య విద్యాధరస్త్రీలు లక్షోపలక్షలు నాహర్మ్యముల నివసించుచున్నారు. ఎట్టిమహాశౌర్యవంతుల పత్నులయినను మదీయకటాక్షమునకై ముప్పొద్దును గనుపెట్టియుందురు. అట్టి నేను నిన్ను మిక్కిలి ప్రార్థించుచున్నాను. నన్ను దూఱుట నీకు మేలుగాదు. నామాట విని నావెంట రమ్ము. నిఖిలభోగము లనుభవించెదవు.

సీ: దురాత్మా! యాఁడుదాన నని నోరికి వచ్చినట్లు ప్రేలుచున్నావా! నీవు పరస్త్రీల నెందఱ నేనిఁ జెఱగొనితెచ్చి పుణ్యము గట్టుకొనియుండిన నుండవచ్చును. నాయొద్ద నిట్టి మాటలు పలుకకుము. రాముని శరజాలముల నీశిరము వేవ్రక్కలై భూమిపైఁ బడును. దుష్టచిత్తా! ఒంటినుండు స్త్రీలను మోసగించి చెఱుప వచ్చితివా! నీ కాయువు మూఁడిన ట్లున్నది.

రావ: సీతా! కొంచెము శాంతింపుము. ఈకోపము లెల్లప్పటికి నుండునవికావు. నీ వాక్యములకు నేను గోపింపను. ఎంతటి యభీష్టమున్నను స్త్రీలు తొలుత నింతమాత్రమైన గడుసుఁదనము చూపరా!

గీ॥ లలన! యిపుడు కోపోక్తులఁ బలుకు నీవ। ప్రేమమై కొంతవడి కాదరింపఁగలవు;
మొదలు గర్జించు మేఘమే పిదపఁ బూర్ణ। వృష్టి గురిసి లోకముఁగాచువిధముగాఁగ.

లతాంగీ! నీ వెన్ని కఠినోక్తులు పలికినను నాకుఁ బరమసంతోషము. ఎండవేఁడిమి నెఱింగినవాఁడే నీడయందలి సుఖముఁ దెలియఁజాలును. ఇప్పుడు కఠోరవాక్యములు వెడలించు నీమోవినుండియే మున్ముందు తియ్యని యధరామృతమును గ్రోలు పుణ్యము నాకు లభింపఁగలదు. అయ్యో! తరుణీ! తాఁకినఁ గసుగందు నీకోమలశరీరమున కారాముఁ డెంతపశుప్రాయుఁడో! వల్కలములను గట్టించియున్నాఁడు. శృంగార వనములయందు మణిమయహర్మ్యములయందు వేనవేలు చెలికత్తె లూడిగముసేయ నాపట్టఁపుదేవివి గమ్ము. భామా! ఆహా! నీ పే రెంత మధురముగ నున్నది! రాను రాను నీవును నాకన్నులకు మఱింత మోహనముగఁ గనఁబడుచున్నావు. సీతా! సీతా! యీమరుబాధ కోర్వఁజాల. రమ్ము. నీబిగికౌఁగిటఁ దేల్పుము.

సీ: దురాత్మా! పతివ్రతాంగనల దురాలాపము లాడు నీనాలుక వేయి చీలిక లగును. ధర్మ రక్షకుఁడగు భగవంతుఁడు నీశిరముపై నేటి కొకమహాపర్వతము వైచి నిన్నంతము నొందింపకున్నాఁడు! ఛీ! దుర్మార్గుఁడా! వంచనాపరాయణా! యిప్పటికైన నిచ్చోటు పాసి పోయి నీప్రాణమును గాపాడుకొనుము. ఈసంగతి శ్రీరాముఁ డెఱుంగునేని...

శా॥ కోపాటోపవిజృంభణంబుమెయి నక్షుల్ నిప్పులఁగుప్పఁగాఁ,
జాపారోపిత చండకాండముల విశ్వం బెల్ల ఘూర్ణిల్ల, నీ
వే పాతాళముఁ జొచ్చి డాగినను బోనీ కట్లు నీశీర్ష మో
పాపాత్మా! భువిఁ గూలనేయు దివిజుల్ ప్రాపుండి కాపాడినన్!

రావ: సీతా! నే నెంతదూరము సైరించుకొని సామవాక్యము లాడుచున్నను నీవు మౌర్ఖ్యమును విడువకున్నావు. ఏమీ! నీరాముఁడు పరాక్రమవంతుఁడు నన్నుఁ జంపువాఁడునా! నాకు భయ మెత్తి దేహ మాపాదమస్తమును వడ కెత్తుచున్నది! తరుణీ! నీతో నిన్నిమాట లేటికి! నాసహజస్వరూపమును జూపెద. చూడుము.

ఉ॥ దండిగ బాహు లిర్వది ముదంబున నెత్తి సగోత్రమైన బ్ర
హ్మాండము నెల్లఁ బిండియగున ట్లొనరింపఁగఁ జాలు సాహసో

ద్ధండబలుండ; నాయెదుట దర్పవిహీను నరణ్యవాసు శూ
రుండనెదేల! రాము నెవరున్ గనరో! యొకబక్కమానిసిన్.

(నిజరూపముఁ దాల్చును.)

సీ: (చూచి భయమున) దేవా! పదితలలు నిరువదిబాహువులు గలిగి, జగద్భయంకర స్వరూపముగల యొకఘోరరాక్షసుఁడు తారసిలి నన్ను బాధించుచున్నాఁడు. నీసాయములేక యొంటిమెయి నిందు దురపిల్లి వాపోవుచున్నదాన. హా! రామచంద్రా!

(మూర్ఛిలు చున్నది.)

రావ: ఈమె నన్నుఁ జూచి భయమున మూర్ఛిలినది. ఇదియే మంచి సమయము.

మ॥ అమరేంద్రాదులఁబాఱఁద్రోలి కడుఁబూజ్యంబౌ సుధాపూర్ణకుం
భముఁ బక్షీంద్రుఁడు తాను గైకొనినరీతిన్, లోకసంశ్లాఘనీ
యమహామంజులతానిధానయగు నీయబ్జాననన్ బట్టి శీ
ఘ్రముగాఁ జేకొనిపోవువాఁడ విహితవ్రాతంబు లగ్గింపఁగన్.

(ఎత్తికొనిపోయి రథముపై నుంచును.)

తృతీయాంకము.





# సీతాపహారణము.

## చతుర్థాంకము.



రంగము—అరణ్యమధ్యము.

రాముఁడు ప్రవేశించి.

క॥ ఈ మాయామృగరాక్షసు। భీమంబగు నార్తరవము వినిన పిదప నా
సౌమిత్రియు భూపుత్రియుఁ। దా మేగతి పట్టిరో! వ్యధాభారమునన్!

ఈమాయాహరిణము పట్టెద మన్నఁ జేఁజిక్కక, కొట్టుద మన్న నెమ్మేనిమెఱుఁగుల నాసగొల్పుచు నీమహారణ్యమున నన్నెంతయో దూరము తెచ్చినది. ఇంతదూరము వచ్చియు నింత శ్రమపడియు దీనిచర్మమైనఁ దీసికొనిపోయి సీత ముద్దు చెల్లింపఁజాలక పోతిని. మఱియు నిది యొకరాక్షసుఁడై మదీయశరాహతిఁ గూలునపుడు 'హా! లక్ష్మణా'యని యార్తరావము వెడలించెను. ఈధ్వని విని సీతయు లక్ష్మణుఁడు నెంతభయ పడిరో! ఎంత చింతించిరో! శోకాతురమై దీనాననయై సీత లక్ష్మణు నెన్నియోవిధ ముల నొప్పించి కడ కొప్పించి నాకడకు బొమ్మని యుండును! కోమలహృదయుఁడగు లక్ష్మణుఁ డామె వ్యధఁ జూడలేక నాకొఱకై బయలుదేరియుండు నేమో! నాయెడమక న్నదరుచున్నది.

చ॥ ననుఁ గనకుండ నేనియు క్షణంబును నోర్వఁగలేని యామహీ
తనయయు, నన్నె దైవ మని తద్దయు భక్తిని గొల్చు లక్ష్మణుం
డును మృగదైత్యు దుస్సహ కఠోర నినాదము విఁచు నెంతగా
సిని బడియుండ్రో! వారలకు సేమము గల్గెడుఁగాత మియ్యెడన్.

నేను శీఘ్రముగఁ బర్ణశాలకేగెద. అదుగో దీనాననుఁడై లక్ష్మణుఁ డిచ్చటికే వచ్చుచున్నాఁడు. నేను సందేహించినట్లు కార్యగతులు నడచియుండును.

లక్ష్మణుఁడు ప్రవేశించి.

ల: విచారాక్రాంతచేతస్కుఁడై రామచంద్రుఁ డెదురుగ వచ్చుచున్నాఁడు (సమీపించును)

రా: (ఆత్రముతో) లక్ష్మణా! యేమి యిటు వచ్చితివి!

ఉ॥ నవ్వుమొగంబి దేల మలినమ్మయి చూపెడుదీనవృత్తి! దా
దవ్వుల నన్నుఁ జూచి కనుదమ్ముల నశ్రులు నించె దేల! నీ

నెవ్వగ కేమిహేతు! వవనిజ సుఖమ్మున నున్నదే! నిర్భ
గ్రొవ్వున దానవుల్ చెనకిరో! వచియింపఁగదన్న లక్ష్మణా!

సౌమిత్రీ! నీదీనాననముఁ జూడ నాహృదయము భేదించుకొనిపోవుచున్నది. అన్నా! నీ వేటి కిందు వచ్చితివి! జానకి యే మైనది!

ల: పర్ణశాలకడ నున్నది.

రా: ఆమె నొంటి విడిచి నీ వేల యిటు వచ్చితివి!

ల: నీసేమము దెలిసికొని నిన్నా మెయొద్దకుఁ బిలిచికొని పోవుటకు.

రా: సౌమిత్రీ!

గీ॥ సీత నేమఱ కెపుడు రక్షింపు మనుచు। నాజ్ఞయిడి నేను రాగ నీ వట్లు సేయ
కబల నేకాంగి దానవప్రబలమైన। దారుణాటవి విడిచి రాఁ దగునె! చెపుమ!

ల: దేవా! యధిజ్యశరాసనుండవై నీ వా హరిణమువెంట నరణ్యమునకు వచ్చిన కొంత వడికి 'హా! లక్ష్మణా' యని యార్తనినాదము పర్ణశాలయొద్దకు వినవచ్చినది. ఆ నాదము సీతామహాదేవి నీకంఠధ్వని యని భ్రమించి నీసాయమై పొమ్మని నన్ను నిర్బంధించినది. దుస్సహమయిన యామె మనోవ్యథఁ జూచి నిన్ను వెదకుచు నిటు వచ్చితిని.

రా: లక్ష్మణా! యీవిషయమున నీవు దీర్ఘాలోచన చేయలేదు.

మ॥ గుముఱై లోకములెల్ల మార్కొనిన నుగ్రుల్ నూచముల్ జేయఁ జా
లు మహాసత్త్వుఁడ నంచు న న్నెఱిఁగియున్ లోలాక్షి బాధించె న
న్న మహావేశముతో ధరాత్మజ నరణ్యంబందునన్ డించి య
ల్పమతిన్ వత్తువె! యింత నంత నయినన్ బ్రాపుండఁగాఁ జెల్లదే!

కుమారా! స్త్రీయగుట నెఱుక సాలక మీావదినె నాసేమమునుగూర్చి శంకించిన శంకించెఁగాక. నీవు నాపరాక్రమము నెఱుఁగుదువే! నీ వైన నామెకు ధైర్యము బోధింపలేదా!

ల: అన్నా! విన్నవించుకొంటిని.

క॥ త్రిభువనములు నొకఁడై కడు। రభసమ్మున పైఁబడినఁ బరాక్రమ తేజో
విభవాభిరాము రామ। ప్రభు నోర్వఁగఁజాల వనుచుఁ బలికితి దేవా!

నిన్నొంటి విడిచి పోయిన నీయరణ్యమున నీ కే యాపదయైనఁ దటస్థించిన మా! యన్న నను శిక్షించు ననికూడ నామెకుఁ దెలిపితిని.

రా: అయ్యో! నీ వింతదూరము చెప్పికొన్నను సీత తెలిసికొనఁజాలక పోయెఁగదా! ఆహా

స్త్రీ లెంత చపలచిత్తలు! ఇట్టి భయభక్తులులేని భామను జనువుమెయి వెంటఁదీసి కొనివచ్చుట నాది తప్పు.

ల: దేవా! యామహాజననిపైఁ గినియకుము. ఇం దా తల్లి దేమి తప్పుగలదు! నీకొఱకై పొమ్మని నిర్బంధించెనేకాని నేను పో నని చెప్పి వెడిలి రాకుండిన నన్నామె యేమి చేసి యుండును! ఆమె దుస్సహవిచారమునకుఁ బాషాణకఠిన మగు నా హృదయము మెత్తవడి, యామె వేఁడికోలు నెపముగ నిడి సీత నుగ్రారణ్యమ్మున డించి నేనె నిన్ను వెదకుచు నిటు వచ్చితిని. ఆమెను విడిచివచ్చినందులకై నన్నుఁ గినిసి దండింతువుగాక. జగత్పూజ్యయు ననపరాధయు నగు మాతల్లిపై నలుక వహింపకుము.

రా: లక్ష్మణా! సీత దానవులచే నపహరింపఁబడిన నెంతటి మానహాని! శ్రీరాముఁ డరణ్యవాసకాలమున నాలిని గోలుపోయె నని జగజ్జనులు నిందించుచుండ నాయపకీర్తి నెట్లు భరింతును!

ల: దేవా! యీాదిన మాపాదులేఁడి కనఁబడినప్పటినుండియు, నది మాయామృగ మని సీతతో విన్నవించినను నీ వద్దానిని వెంబడించినప్పటినుండియు నామనస్సు సహజసుఖ స్థితియందు లేక మిక్కిలి కలఁత నొందియున్నది. దానికిఁదోడు నాజనని హృదయవ్యథ నన్ను మఱింత కుందించినది. కావున ననాలోచితముగను దూరదృష్టిలేకయు మంద ప్రజ్ఞుఁడనై యామె నొంటి విడిచి యిటు వచ్చితిని. ఈయపరాధమంతయు నాశిరమున నున్నది. దీనికి నేను శిక్షార్హుఁడ.

రా: లక్ష్మణా! యానాతి నొంటివిడిచి వచ్చినందున నేవిపత్తు వాటిల్లునో యను భయమున న ట్లంటిని. కాని కుమారా! నీహృదయము నే నెఱుంగనా!

ల: దేవా! మన మిందుండి చింతించిన నేమి ప్రయోజనము! త్వరితముగఁ బర్ణశాలకేగుదము.

రా: అట్లే పోవుదము. (నడచుచు) కాని లక్ష్మణా! మహాజవసత్వములు గలిగి శీఘ్రముగ నడచు వాడుకగల నాకు నేఁ డేటికో నీతోఁగూడ నడచుటకు శక్తి చాలకున్నది. లక్ష్మణా! యొకించుక తిన్నఁగ నడవుము.

ల: అన్నా! నేను జవముతో నడవక యిదివఱకే తిన్నఁగా నడచుచున్నాను.

గీ॥ మానవులకు సంతోషసమయములందు। దేహదార్ఢ్యంబు వృద్ధియై ద్విగుణితముగఁ;
దన్నిరోధక విషమ దుర్దశలయందు। మొదటిధృతిగూడ వమ్మయి పోవుచుండు.
దేవా! యెట్టులో నడచి మనము పర్ణశాలఁ జేర వచ్చితిమి.

రా: లక్ష్మణా! యిదియేమి వైపరీత్యమో చూడుము!

ఉ॥ వాకిటనున్న కీరము శుభంబగు పల్కులు నేఁడు పల్కదే
లా! కలనాద మొప్పఁగ; నిలాసుతయుఁ దనపూజ్యమైన వీ
క్షాకమనీయవక్త్రమునఁ గన్నులపండువు నేఁడు సేయదే
లా! కలకాలముఁ సలుపులాగు వెలార్చుచు నవ్వువెన్నెలల్.

సౌమిత్రీ! పర్ణశాలాద్వారమున సీతాదేవి పెంపుడుచిలుక నేఁడేలనో నన్నుఁజూచి విజయవాక్యములు పలుకక మోము వ్రేలవైచుకొని యున్నది. చిఱునగవువెన్నెల లలర సంపూర్ణ పూర్ణిమా చంద్రమండలమును దలఁదన్ను ముద్దుమోముతో మీ వదినె నేఁడేటికో నాకనుంగవకుఁ బారణ మొనరింపకున్నది. లక్ష్మణా! సీత లేదు.

గీ॥ కడుపు చల్లఁగఁ గౌసల్య గనిన కొడుకు। దశరథుని పూర్వపుణ్య పాదప ఫలంబు
రామచంద్రుండు కడకు భార్యావియోగ। పరమనిర్భాగ్యతతిఁ జేర్పఁబడెనె యకట!

ల: (స్వగతము) అయ్యో! యీమహాభాగుని దీనదశ యెట్లు చూడనగును! ఎట్లీతని శోకము నపనయింపనగును! ఏమని ప్రత్యుత్తర మొసంగుదును! (ప్రకాశము) దేవా! సీతాదేవి పర్ణశాలలో నిదురించుచున్నదేమో!

రా: నా కా సందేహము లేదు. అయిన వెళ్లిచూచెద. (పర్ణశాలఁ బ్రవేశించుచున్నాఁడు.)

ల: అకటా! యావేగ విచారభార పరికంపితములగు నీసందిగ్ధనిమిషములు మిక్కిలి దుస్సహములు. సూర్యవంశము సకలకల్యాణసంపదలతోఁ బొదలవలయుననుటయో లేక యింతటితో వైభవముఁ గోలుపోయి పాడైపోవలయుననుటయో నిర్ణయింపఁబడు విషమసమయము వచ్చినది. పూజ్యమైన యో సూర్యాన్వయమా! నీయాన్నత్య విలాసమంతయు సీతాదేవి 'కలదు' 'లే' దను రెండు చిన్నిమాటలపై నిలిచియున్నది. సీతాదేవి కలదనిన సర్వలాభప్రయత్నములును గలవు. అన్నియాశలును గలవు. మా దేహములఁ బ్రాణములుగూడఁ గలవు. సీతాదేవి లేదనిన నన్నిభాగ్యములు లేవు. ఆశలును లేవు. దేహప్రాణములును లేవు. అకటా! యిది యెట్టి భరింపరాని సమయము! రామచంద్రుని వాక్యము మాభవిష్యత్తు నెట్లు నిర్ణయించునో!

రా: (పర్ణశాలలో)

గీ॥ పోయితే! సీత! నన్నసహాయుఁ జేసి। కరము గాఢాంధకారబంధురమమైన
పర్ణశాలాంతరమున నఁ బడఁగఁద్రోసి। కటకటా! నీవు వేఱులోకంబుఁ జేర.
హా జనకరాజతనూజా! సీతా! నీదర్శనముఁగూడఁ గఱవుచేసి నన్నెడఁబాసిపోతివే!

ల: అకటా! మిన్ను విఱిగి మీఁదఁ బడియె. సందేహించినది స్పష్టముగ దాపురించె.

రామచంద్రుని సంతాపవాక్యములు వాఁడిములుకులకన్నఁ దీవ్రముగ నాచెవిఁ బడు చున్నవి. మాయాశలన్నియు నడుగంటిపోయె. మావంశచరిత్రమున నియ్యది గొప్ప విషమదశ. అయ్యో! మాతా! మ మ్మిట్లు శోకసముద్రమున ముంచిపోదువే! తొలుత నే వనవాసక్లేశమునను దశరథుని మరణమునను ఖిన్నులమైయుంటిమే! తల్లీ! మైథిలీ! యిప్పుడు నీవియోగదుఃఖము గలిగించి మమ్ము మఱింత గతిహీనులను జేసితివే! అమ్మా! నిన్నుఁ బాయుట యీజగమును బాయుట.

సీ॥ అనసూయమొదలు మున్యంగన లీవార్త విన నిల్వునీరయి పృథివిఁబడరె!
రాజర్షి జనకభూరమణుండు దుఃఖాబ్ధి నీది ప్రాణముల వహింపఁగలడె!
సదయాంతరంగ కౌసల్య శోషిలి గోడుగుడుచుచు ధాత్రిపైఁగూలిపోదె!
నీచెలి నీకూన నీదాసి నాసతియూర్మిళ జీవించి యుండఁగలదె!

గీ॥ యమ్మ! నినుఁ బాయుటే నిజంబైన నేను। రామచంద్రుఁడు సకలసాధ్వీమణులును
జనములును బంధులు నయోధ్య సకలజగము। లకటకట! క్రుంగిపోమె శోకార్ణవమున.

రా: (వెలుపలికి వచ్చి)

సౌమిత్రీ! నిన్నును నన్నును బ్రాణాధికముగఁ జూచి యాదరించుచుండిన జగత్పావని జనకతనయ యీదినము మనకు లేదు.

సీ॥ ఏబాల జనకపృథ్వీశ్వరుకులము పావనముచేయ జనించెఁ దనయయగుచు!
నేనాతి దశరథు ని ల్లుద్ధరించు సద్గుణములుగల పెద్దకోడలగుచు!
నేకాంత నాపుణ్యమేపార ననుఁ బెండ్లియాడి నన్ జేరె నర్ధాంగియగుచు!
నేధన్య నిన్ను నెంతేఁ దల్లివలెఁబ్రియంబొదవ విచారించు వదినెయగుచు!

గీ॥ నాజగత్పూజ్య యార్ద్రసౌహార్దహృదయ। యామహాసాధ్వి నాదుప్రాణాధికాను
రాగనిలయ సద్గుణగణరత్నరాశి। నాదుసతి సీత లక్ష్మణా! నాకు లేదు.

మనోహరప్రపంచమును గాఢాంధకారమునఁ బడద్రోసి పోవు సూర్యప్రభాకరణిఁ దమ్ముఁడా! యవనీతనూజ న న్నెడఁబాసి పోయినది.

ల: ఆవును బాసిన క్రేపునకువలెఁ దల్లికి దూరమైన బిడ్డకువలె నాజనని సీతాదేవిని బాసినశోకమున నాకు మతిభ్రమ గలుగుచున్నది. ఏదేని యైంద్రజాలికశక్తిచే దేహము మీఁది యెఱుకమాత్ర ముండునట్లుచేసి ప్రాణసత్వమంతయు హరించిన నెట్లుండునో యట్లు నాదేహప్రాణములు క్షీణబలము లగుచున్నది. ఓడ విరిసి పట్టుకొన నేయాఁతయు లభింపక యపారసముద్రమధ్యమునఁ బడు విపన్నులవలె మనము

జానకీవియోగశోకాంబురాశిని బడితిమి. ఇది యేసాహాయ్యసంపత్తియు లభింపని నిర్జనారణ్యము. మనకై మనము ధైర్యముదెచ్చుకొని నిలువవలెనేకాని మనల నూరార్చువారు లేరు. దేవా! శోకసంతప్తహృదయుఁడవయిన నిన్నుఁజూచి నేను సహించుకొనఁజాల. ఇది గొప్ప విషమపరీక్షాసమయము. ఎట్లో ధైర్యము నవలంబింపుము. అయ్యో! మనభవిష్యత్తంతయు నిట్లు గాడాంధకార బంధురమై పోవచ్చునే!

రా: లక్ష్మణా! యీశోకమున నీముఖము మిక్కిలి చిన్నవోయినది. సీత తన వియోగమున నన్నుఁ గుందించుచున్నది. కాని నీకుమాత్రము తక్కువసంతాపముఁ గలిగించియుండునా! అయ్యో! సీతయెడ నాకెంత ప్రేమగలదో యంతకన్న నీకామెయెడ భక్తి మిక్కుటమే! నన్ను సీతావియోగమొక్కఁడే బాధించుచున్నది. నిన్నది యొక్కఁడే గాదుగదా! ఒక్కఁడు సీతావియోగదుఃఖమును వేఱొకఁడు తద్దుఃఖసముద్రమునఁ దద్దయు మునింగి ధృతిదూలియున్న నాహృదయవ్యథఁ గన్నులారఁ జూచి యోర్వవలఁనుదుఃఖమును నిన్ను రెండువిధములగు బాధలు కలంచుచున్నవి. అట్లు ద్విగుణితదుఃఖమున మునింగి యుండి యింకను నాకు ధైర్యము నుపదేశించి యుపచరించుచున్నావు. సౌమిత్రీ! నీవెట్టి యుదారగుణంబుల ప్రోవవో!

ల: (స్వగతము) అకటా! నాధైర్యమంతయు క్షీణించిపోవుచున్నది. జగదేకశౌర్యరాశియగు నీమహాభాగుని హీనునిభంగి వగచుచుండఁజేసితే దైవమా! అకటా! యీసతీవియోగము లెప్పుడు ననుభవించువారికి హాలహాలతుల్యములు. చూచువారి హృదయముల కంగారకసదృశంబులు.

రా: సౌమిత్రీ! యేల నాతోఁబలుకవు!

సీ॥ ప్రొద్దుపోకకు సీత పూవుటీరంబున నందంద మెలఁగునో యరయుమన్న!

ల: పూఁదోటఁ దీవెగుంపులు చలించుటెకాని ధరణిజ యున్న చందంబుగాన!

రా: ముదకంబుఁ గొనిరాగ నువిద సరస్సున కేగెనో యటుచూడుమీ! కుమార!

ల: చలదుత్తరంగపంక్తుల పోలికలెకాని యాతటాకముచెంత సీత లేదు!

రా: రక్కసుల్ చెలరేఁగి స్రుక్కింతురని శైలబిలములఁ జేరెనో వెదుకవయ్య!

ల: యల్లిబిల్లిగనున్న వల్లీమతల్లులేకాని సీతాదేవి కానరాదు!

రా: పులులు భూమిజను గండలుకండలుగఁజేసి స్రుక్కించెనో వెళ్లి చూడవయ్య!

ల: పండుటాకులు రాలిపడిన కుప్పలెగాని ధవళాక్షి జనకేంద్రుతనయగాదు!

రా: గీ॥ ధ్వని వినంబడెఁ బోయి సీతను వెదకుము!

ల: పికరుతముగాని వైదేహి పిలుపుగాదు!

రా: కటకటా! జానకీ! నన్నుఁ గనికరంబు
మాని యెడఁబాసితే యుగ్రకాననమున!

ల: దేవా! యిం తెచ్చటను జానకి గానరాదు. స్నానమాడ గోదావరికి వెళ్లెనో ఫలము లకై వనమునఁ దిరుగుచున్నదో!

రా: సౌమిత్రీ! యీసందేహముమాత్ర మేల తీఱకుండవలయు! పోయి వెదకుదమందువా?

ల: నీ వేటికి! నే వెళ్లి చూడఁదగ్గతావులఁ జూచి వచ్చెద. నీ వాకించుక విశ్రమింపుము.

రా: కానిమ్ము. (లక్ష్మణుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రా: హా! సీతా! యెట్టిసంతాపమునకు నను గురిచేసితివి. నిష్ఠురారణ్యమున నన్నిట్లొంటి విడిచి యకస్మాత్తుగ నంతరింతువని కలలోనైనఁ దలంపనైతినే! పదమూఁడుసంవత్సరములక్రిందట నాకు రావలసిన ధరణీసామ్రాజ్యభారము నాయెడనుండి తొలఁగిపోవుట యటుండఁగ్రై కేయీమాత కోరికపెంపున జనకుఁడు దశరథుఁ డాజ్ఞాపింపలేక కడకుఁ దిన్నగా వచింపనైనలేక నన్నుఁ జతుర్దశసంవత్సరములు మహావిపినములకుఁ బంపు నపుడుగూడ నేను సహించుకొని యుండఁగలిగితిని. మహారాజన్యోచితమయిన మంగళవస్త్రములు విడిచి కర్కశములయిన యీ నారచీరలు ధరించి మునులవలె జడలఁ బేడుకొని యీసన్న్యాసివేషమును బూనినపుడైన నేను చింతించియుండలేదు. కాని సీతా! నీ యీ వియోగము నాహృదయమును భేదించుచున్నది.

సీ॥ దర్భాసనంబులే తపనీయరత్నసింహాసనంబులకన్న హర్షమిచ్చు;
నీపర్ణశాలలే హేమనిర్మితమహాప్రాసాదతతికన్న రక్తి నెఱపుఁ;
బృథుశిలాకంటకావృత మీవనం బయోధ్యాపురికన్న సౌఖ్యం బొసంగు;
ఘాతుకసత్వసంఘాతముల్ హృద్బంధుతతికన్న మిగుల నా ప్తతను గూర్చుఁ;

గీ॥ బంకజేక్షణ! నీవు నాపజ్జనుండ। దండకయె నాకు సామ్రాజ్యధామమయ్యె;
రమణి! జగమె గాఢాంధకారమున మునుఁగు పగిదిఁ గనుపట్టె నీవు నన్ బాయుకతన.

ఉ॥ నీదువియోగభారమును నే సహియింపఁగనోప! నోప! నా
మీఁదఁ జలంబు మానుమని మిక్కిలి ప్రార్థన చేయువాఁడ! నా
యీ దురవస్థ మాన్చి తమి నేలఁగ నిన్నదె వేఁడువాఁడ! రా
వే! దయఁ జూడవే! పలుకవే! ననుఁ జేరి సమాదరింపవే!

సీతా! నీకు నాపైఁ గరుణ కలుగదా! నీవు నన్ను మన్నించి యేలుకొనవా! చంద్రాననా! కార్తికరాకాశశాంకబింబమును దలదన్ని మందహాసజ్యోత్స్నల వెదచల్లి

హృదయాహ్లాదకరమైన నీమనోహరవదనముతో వాకుఁ గనుపింపవా! నన్నాదరించు విశుద్ధప్రేమ తొలుకాడుచుండు నీ విశాలదీర్ఘలోచనములనుండి మనోహరతరళదృష్టుల నాపైఁ బరపి నన్నలరింపవా! జానకీ! యొకనిమిషమైన నన్నెడఁబాయకుంటివే! నేఁడేల యీవిషమవిధానము! నేనును సౌమిత్రియుఁ బర్ణశాలకు వచ్చి యింత సేపయియుండియు నీ వేల యింకను ననుఁ జేరరాకున్నావు! నాగతి యేమి! అరణ్యవాసాంతమున నే నెట్లయోధ్యకుఁ బోదును! కౌసల్యాసుమిత్రలకును భరతశత్రుఘ్నులకును మోము నెట్లు చూపుదును! నాయందుకన్న నెక్కుడు ప్రేమతో సీతా! సీతా! యని నిన్నే మఱుక యాదరించు కోమలస్వభావ నాజనని కౌసల్యాదేవి వచ్చి "రామా! యరణ్యములో నీయలమటఁబాపి సదా నీ కుపచరించుటకై తోడుగ సీతాదేవి వచ్చెనే! నీ విపు డొంటి వచ్చితివే! సీత నేమిచేసితి వెందు డించివచ్చితి" వనిన నే నేమని యుత్తర మియ్యవలెను! కౌసల్యయంతటి సౌజన్యధన్య సుమిత్రాదేవితో నేమని విన్నవించుకొందును! నాసోదరి సీతాదేవి నెచ్చట విడిచివచ్చితివన మృదుహృదయుఁడు లక్ష్మణుఁ డూర్మిళాదేవి నెట్లూరార్పఁగలఁడు! అయ్యో! యూర్మిళ నీకు మిక్కిలి కూర్చునదియే! నీహృదయసమీపవర్తినియే! సీతా! దీనాననులమై సత్వవిహీనులమై భగ్నమనోరథులమై నిరుపేదలభంగిఁ గనుఁగవ బాష్పధార లొలుక నిలుచుండిన మమ్ముఁ జూచి భరతశత్రుఘ్నుల గుండియ లవియవా! వాత్సల్యనిధానులగు వారిరువుర నేమిచెప్పి యూరార్పవలయు! దశరథమహారాజునకన్న నన్ను గారాబముతో వీక్షించి మాపురోవృద్ధి నెప్పుడు కోరుచుండు పుణ్యరాశి కులగురుఁడు శతవృద్ధు వసిష్ఠమహాముని మాకు వాటిల్లిన యవస్థకై యెన్నివిధముల నొచ్చునో! ఎంత దుఃఖించునో! బాల్యమున ననేకదైతేయసమూహములఁ జక్కాడిన శౌర్యవంతుఁడననియు నీశ్వరుని ధనువు నవలీల విఱిచివైచిన మహాభుజుఁడననియు జగదేకధనుర్ధరుఁడననియు, మహారాజకుమారుఁడననియు నాయెడ నెంతయు గౌరవము గలిగి జనకమహారాజు తాను ప్రాణాధికముగఁ బెంచుకొనిన నిన్ను నా కిచ్చి వివాహము చేయించెను. సీతా! యిప్పు డా జనకునకు నే నేమి చెప్పుదును! అయ్యో! యంతయేటికి! ఈపర్ణశాల దాఁటి యొకక్రోసెడు దూరము పోకమున్నె యనసూయాదేవి లోనగు మునిపత్ను లందఱును "లోకారాధ్యచరిత్రయగు సీతాదేవి యేది" యని మమ్ముఁ బ్రశ్నింతురే! నే నేమి యుత్తర మిత్తును! అయ్యో! నీవియోగమును నేనుమాత్ర మెట్లు సహించుకొందును! వైదేహీ! నాసంతాపము మాటలతోఁ దెలుపరానిదై దేహముతో భరింపరానిదై మనస్సుతో ననుభవింపరానిదై యున్నది. సీతా! నా

యీ శోకము నీ వేల గుఱుతింపవు! ఏల నాసమీపమునకు వచ్చి దర్శన మొసఁగవు! మైథిలీ! నేను దీనుఁడ. రాజ్యభ్రష్టుఁడ. అరణ్యసంచారుఁడ. భగ్నమనోరథుఁడ. శోకపరితప్తుఁడ. నన్నిట్లేటి కకాలమరణముపాలు గావించుచున్నావు! అకటా! హృదయమునఁ దీవ్రవేదన గలుగుచున్నది. బుద్ధి విభ్రమము నొందుచున్నది. ప్రళయవాతములు నాపై వీచి నన్ను దూరము గొనిపోవునట్లున్నవి. గాఢాంధకార మడ్డమై కన్నులు కానరాకున్నవి. అణఁపరాని యారాటము గలుగుచున్నది. హా! జనకరాజతనూజా! సాధ్వీవతంసమా! భువనపావనీ! జానకీ! జానకీ!

(మూర్ఛిలుచున్నాఁడు.)

ప్రవేశము—లక్ష్మణుఁడు.

నా తిరుగుటయంతయు వృథయైనది. ఎంతవెదకినను సీతాదేవిజాడ తెలియరాకున్నది. రామచంద్రున కేమని చెప్పికొందును! (నడచుచు తిచ్చవడి నిలిచి) ఏమిది! విక్రమోన్నతధైర్యగాంభీర్యసదనుఁడైన మాయన్న యిట్లు భూమిపై నొరగియున్నాఁడు! (సమీపించి) దేవా! దేవా! అయ్యో! విశ్రాంతిఁగొనుట కాదు. అకటా! యిది యెట్టి సంతాపదినము! (ఒద్దఁ గూర్చుండి) రామచంద్రా! రామచంద్రా! (కదలించి) అయ్యో! పలుకవే! అకటా! యింకేమున్నది. హా! జగదేకధనుర్ధరప్రవరా! పరమకృపాళూ!

చ॥ ఇనసమతేజ! లక్ష్మణుఁడ నేను; భవత్పదసేవకుండ; నీ
కనుఁగవ విప్పవేల! ననుఁ గన్గొన వేటికి! పల్కవేల! వే
డ్కను దటిఁ జేర్పవేల! బిగికౌఁగిటఁ దేలుపవేల! నీ వుపే
క్షను వహియింతువేని మనఁజాల నిమేషము లోకరక్షకా!

దేవా! సీతామహాదేవికొఱకే దుఃఖించుచుంటివే! నీకు వాటిల్లిన యీయవస్థఁజూచి నే నెట్లు భరింపఁగలను! సీతావియోగము నిన్నును నన్నును జననులను సోదరులను మాత్రమే శోకమున ముంచును. నీవియోగము చతుర్దశభువనములను దల్లడిల్లఁ జేయునే!

సీ॥ గుణరాశివగు నిన్నుఁ గోల్పోయి యావసిష్ఠమహర్షి భూమి నుండంగఁగలఁడె!
ప్రియకుమారకుని నిన్ బెడఁబాసి కౌసల్య యిలఁ బ్రాణములు భరియింపఁగలదె!
భ్రాతృదైవమటంచు భావించు భరతుండు నీవులేక ధరిత్రి నిలువఁగలఁడె!
నాప్రాణతుల్యమై నాదైవమైన నిన్ విడిచి నే నకట! జీవింపఁగలనె!

గీ॥ హా! యనుజవత్సలా! రామ! యీయరణ్య। దేశమున నన్ను విడిచి నిద్రించినావె!
యన్న! నీనిద్ర యది ప్రళయంబు గాదె! క్షణములో న స్తమింపవే జగము లెల్ల!

రామచంద్రా! నీవులేమి నీజగము నాకు దుర్వారతమఃపరిపూరితమగు గుహా కుహరముం బోలియున్నది. నిన్ను సేవించు నమూల్యకాలములో నొకయింతయైనను దగ్గుటకోర్వక యేకోదరజనితుఁడయిన నాచిన్నితమ్ముని శత్రుఘ్నునైన ముద్దాడ వెళ్లియెఱుంగనే! నీవెంటవచ్చినప్పుడు కౌసల్యాదేవికి నీతోఁగూడ సపర్య లొనరించుచుంటినిగాని నిన్నువిడిచి సుమిత్రయొద్దకైనఁ బోకుంటినే! అయోధ్యలో నిలువుమని నీ వెన్నివిధముల నిర్బంధించినను నీపదసేవలేక నిమిషమైన నుండఁజాలని కారణమునఁ గదా నీకన్నముందు ధనుర్ధరుఁడనై నేనరణ్యమునకు వెడలివచ్చితిని. దేవా! నీవులేక యీయరణ్యమున నీపర్ణశాలలో నాకిఁక నేమిపని! అయోధ్యకుమాత్ర మేమిముఖము పెట్టికొని పోవుదును! అయ్యో! మన మడవికి వచ్చునప్పుడు కౌసల్యాదేవి బాష్పధారాకులలోచనయై గద్గదస్వరమున నన్ను సమీపించి "లక్ష్మణా! నీవు తోడుగ నేగుచున్నందున నా కొకించుక ధైర్యము గలుగుచున్నది. అడవులలో నీయన్నను వదినె నెట్లు కాపాడెదవో! నీవు వెంటనుండువను ధైర్యమున నెట్టులో ప్రాణములఁబట్టి యుండెద"నని ముల్లోకముల రక్షింపఁగల నిన్ను సంరక్షించు భారము నాతలపైఁ బెట్టి యుండెనే! నేను నందుకు సమ్మతించియుంటినే! నిన్నును సీతామహాదేవినిఁ గోలుపోయి నే నెట్లయోధ్యకుఁ బోదును! పదమూఁడు సంవత్సరములక్రిందటఁ దండ్రి చావును నీకు రాజ్యభ్రష్టతయుఁ గలిగి వనవాసమునకు వచ్చునపుడైనఁ జింతించి యెఱుంగనే. రాజ్యభోగములు లేకున్నను సౌఖ్యములు లేకున్నను మీరిరువు రెందేని మునివృత్తితోనైన వల్కలాజినములు ధరించుకొనియైన బ్రదికియుండిన మీచరణసేవ మాత్రము నాకు లభించుచున్నదని నేను సంతోషమున నుప్పొంగుచుందునే! అయ్యో నీస్థితిఁజూచి నేను సహింపఁజాల. దేవా! నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు. దశరథప్రతిమానుఁడవు. సోదరరూపమున నన్నుద్ధరింప నవతరించిన శ్రీమహావిష్ణుఁడవు. నాకు నీతోడిద లోకము. నీసేవ నా కింద్రభోగము. నీమాట వేదవాక్యము. నీచిఱునగవు త్రిలోకీ సామ్రాజ్యాభిషేకము. నీమైత్రి నాకుఁ బ్రాణాధికము. దేవా! ని న్నెడఁబాసి యీ మేనఁ బ్రాణములు నిలువవు. నాహృదయము నీరై పోవుచున్నది. నిలుచుటకు శక్తిలేక బట్టపేలికలవలె నాకాళ్లు తూఁగాడుచున్నవి. దేహ మాద్యంతము కంపించుచున్నది. హా! సూర్యవంశమణిమయాలంకారా! ఇక్ష్వాకుకులోద్ధారకా! పరమపురుషా! రామచంద్రా! హా! చతుర్దశభువనమహాగురూ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

(యవనికపడును.)

చతుర్థాంకము.

శ్రీ

# సీతాపహరణము.

పంచమాంకము.



(అరణ్యము-రథముపై సీతా-రావణులు ప్రవేశించుచున్నారు.)

సీత: ఉ॥ శ్రీరఘువంశమౌళి! పదిశీర్షము లిర్వదిబాహులున్న దు
ర్వారభయంకరాసురుఁడు పట్టి చెఱంగొని పోవుచున్నవాఁ;
డేరును దిక్కులేకయిదె యేడ్చుచుఁ బొక్కుచు నున్నదాన; రా
వే రయమార! వచ్చి మఱి వీనిని ద్రుంపవె! నన్నుఁ గావవే!

రామచంద్రా! బావురుగానిచేఁజిక్కిన బాలశుకాంగనవలె, భయంకరశార్దూలము బారినిబడిన హరిణివిధంబున నే నీ దుర్మార్గరాక్షసునిచే బట్టువడి పలవించుచున్నాను. వీని భయంకర స్వరూపముఁజూచిన నాగుండియ లవియుచున్నవి. ప్రాణము లెంతయో సేపు నిలుచునట్టులేవు. త్వరితముగవచ్చి నన్ను రక్షింపుము.

చ॥ అనిలజవంబుతోడ రథమక్కట! పాఱెడి; నీకు దూరమై
చనెద క్షణక్షణంబునకు; శాతశరంబున నీనిశాచరుఁ
దునుమవె; లేక లక్ష్మణుని దోడనె పంపవె; యమ్మహాత్ముఁ డీ
దనుజు వధించు; నీకడకుఁ దప్పక చేరుచు నన్ను రాఘవా!

రావ: సీతా! నిన్ను నేఁ గొనివచ్చినందున నీకేమి లోపము గలిగినది. ఆకలములు తిని యరణ్యములలో శ్రమపడుటకుమాఱు సహస్రపరిచారికా పరివృతవై నాహర్మ్యముల లో సౌఖ్యము ననుభవించెదవు. ఈ నా యిరువదిబాహువుల సాయమున బ్రహ్మాండము నైనఁ బిండిసేయుసరింపఁజాలుదు. అట్టి నన్ను బక్కమానిసులగు నీమగఁడు మఱఁది యునా తెగటార్చెదరు. ఇవియేటి మాటలు! నీయంత నూఱంతలు మాహాత్మ్యమును జూపిన కాంత లెందఱో యిపుడు నాబిగికౌఁగిట సర్వసౌఖ్యము లనుభవించుచున్నారు. కావున దూరాలోచనము గలిగి నను ప్రేమించి నీవును సుఖపడుము.

సీ: దానవాధమా! నావిభుఁడు లేని సమయమున వచ్చి మోసమున ననుఁ జెఱగొని తెచ్చి యిప్పు డింకను గలుషభాషణము లాడుచున్నావా! ఇట్టి శౌర్యరాశివి రామచంద్రుఁ డుండఁగనే యేల రాఁగూడదు! వచ్చియుండిన నీపదిశిరము లింతకే తెగి భూమిపైఁ గందుకములవలె రాలియుండునే!

రావ: సీతా! హీనపరాక్రముఁడగు రాముని మాటిమాటికి నాకడఁ బ్రశంసింపకుము. నీవు నాచేఁ జిక్కితివి. నాకుఁ గోపముఁ గలిగించుట నీకు మేలుగాదు. నీమాటలవలన నేమియు లాభము నుండదు. చూడుము. హయముల నతివేగమున నడపెదను. ఇఁక నీవు రామునిఁ గలలోనైనఁ దలంపఁగూడదు. (తోలుచున్నాఁడు.)

సీ: హా! రామచంద్రా! దీనశరణ్యా! నిన్ను దూరము పంపి నన్నొకరక్కసుఁ డెత్తికొని పోవుచున్నాఁడు. నన్ను విడిపించి నీయందఁ జేర్చువా రెవ్వరును లేరు. నాథా! మృగ రాక్షసుఁ దునుమాడి పర్ణశాలకు వచ్చి నన్నుఁ గానక నీ వెంత దుఃఖించితివో! దేవా! "యీసీతను బ్రాణపదముగఁ బెంచుకొనుచున్నా"నని మొన్న నేగదా నీవు శూర్ప ణఖతో ననియుంటివి. నీయండనుండి నీచేఁ బ్రేమింపఁబడు భాగ్యము నాకింకేమి కలుగును!

మ॥ తళుకుంబంగరులేఁడి తెచ్చి యిదె చెంతన్ జేర్చుచున్ సౌఖ్యమున్
గలుగన్ జేయుమటంచు నంపినపుడే కన్ బ్రామి వేతున్కనై
తొలఁగంబోలు ఋణానుబంధమది నీకో నాకు; నేనేగతిన్
బలితంబైన భవద్వియోగమునకున్ బ్రాణంబులన్ నిల్పుదున్!

అన్నా! లక్ష్మణా! "వలదు, మృగము వల"దని యెన్నివిధములనో బోధించితివే! నీ వమాయకుఁడవే! నిన్ననరాని మాట లంటినే!

సీ॥ ముప్పొద్దు దినదినంబును నమస్కృతి సేయునపుడైనఁ బాదంబు లంట వెపుడు!
తలవాంచి దూరాన నిలుచుటేకాని యించుకయైనఁ గన్నెత్తి చూడ వెపుడు!
తల్లీ! యటంచు మాతా! యంచునేకాని వేఱుపేరుల నన్నుఁ బిలువ వెపుడు!
మాశుభ మ్మనయంబు మదిని గోరుటెకాని కలనైన నన్యథా తలఁప వెపుడు!
గీ॥ పలుకరాని దుర్భాషలు పలికినపుడు। కోమలము నీమనం బెంత కుందెనొక్కొ!
యన్న! లక్ష్మణ! యదితలంపైనయపుడు కుములు డెందము దైత్యుఁడుగొనుటకంటె.

అన్నా! లక్ష్మణా! నాపాలిదైవమవై పదమూఁడుసంవత్సరముల నుండియు నన్నుఁ గాపాడుచుండిన నిన్ననరాని దుర్భాషలాడుటయా నీకుఁ నేఁజేసిన బ్రత్యుపకృతి! నిన్ను నిందించి నేను మిక్కిలి పాప మొనరించితిని. అయ్యో! నా కీయాపద వచ్చె నని నీవింక నెఱుంగవా! ఎఱిఁగిన నీవేలరావు! నన్నేల విడిపింపవు! మీయన్నయొద్ద నేల చేర్పవు! అయ్యో! నామొఱ యాసూర్యవంశజులకు వినఁబడినదా! నాకేది దిక్కు!

సీ॥ "పావనాకార! గోదావరీదేవి! నీ వెఱిగింపవమ్మ! రాజేంద్రుతోడ!
నోమాల్యవంతపుణ్యోన్నతగిరినాథ! చెప్పంగదే రాజసింహుతోడ!

## సీతాపహరణము.

నోజనస్థానమహీజములార! నావిధ మెఱిగింపరే విభునితోడ!
నోదండకాటవి నున్న తాపసులార! నాపాటు చెప్పుఁడీ నాథుతోడ!
గీ॥ నేను శ్రీరాముభార్య; మీ రెవ్వరైన నడ్డపడి తాఁకి విడిపింపరయ్య! కావ
రయ్య! సురలార! మునులార! యక్షులార! యఖిలదిక్పతులార! పుణ్యాత్ములార!"

అకటా! నన్నుఁ బలుకరించువా రొక్కరైన లేరే! పతివ్రత నొక దురాత్ముఁడు చెఱఁగొనిపోవుచుండ విడిపింప నీభారతదేశమున నెక్కఁడైన నార్తబంధుఁడు లేఁడా! ఇది యంతయు నామందభాగ్యము. హా రామచంద్రా! లోకరక్షకుఁడవగు నీ వుపేక్ష వహించిన నన్నెవ్వరు రక్షింతురు! దేవా! నిన్నె నమ్మియున్నాను. వచ్చి యీదైత్యుని ద్రుంచి నన్నుఁ జేకొనుము.

రావ: **సీతా!** యీఘోరారణ్యమున నీమొఱ యెవ్వరాలకించెదరు! ఏటి కీయరణ్యరోదనము! ప్రళయకాలరుద్రుఁడు వచ్చియు నన్నుఁదాఁకి నిన్ను విడిపింపఁజాలఁడు. ఆ యాస వదలుకొమ్ము.

సీ: గీ: హా! సరోజాప్తకులకలశాబ్ధిసోమ! హా! దశరథేంద్రతనయ! శౌర్యైకనిలయ
హా! సుగుణధామ! హాలక్ష్మణాగ్రజన్మ! యార్తనగు నన్నుఁ బ్రోచి పుణ్యంబుగొనుమ!

దూరమునుండి జటాయువు.

మ॥ లలనారత్నమ! యేల నద్దెసలు ప్రీలన్ బిట్టువాపోవ! నిన్
సిలుఁగుల్ పెట్టిన వాఁ డెవండయినఁగానీ; వానిశీర్షంబు వ్ర
య్యలుగా రాలు; జటాయుమేనఁ దుదియూర్పున్నవాఁ డున్నంతకున్
పరిభయంబున్ బొనరించి ధర్మమును గాపాడన్ బ్రయత్నించెదన్.

అమ్మా! భారతదేశము ధర్మశూన్యము కాలేదు. నీవెవ్వతెవనికూడ నడుగను. ధర్మము నుద్ధరించు ప్రయత్నమున దేహప్రాణములనైన విడుచుటకు నేను వెనుదీయను. తల్లీ! భయపడకుము. ఇదె వచ్చుచున్నాను.

సీ: చ॥ ఖగకులసార్వభౌమ! రఘుకాంతుని కాంతను; సీత నేను; నా
మగఁడు మఱందియున్ విపినమధ్యముఁ జేరఁగ మాయ పన్నిపం
పి గడుసురక్కసుండొకఁడు వేగమె నన్ జెఱవట్టి కొంచుఁ బా
ఱఁ గడఁగె; వీని కడ్డువడ రమ్ము! ననున్ విడిపింపు మెమ్మెయిన్.

పక్షిశేఖరా! యేసాయములేని యబలను. రక్షింపుము. రక్షింపుము.

సమీపించి జటాయువు.

అయ్యో! మాతల్లి సీతాదేవియే! ప్రళయము తటస్థించినది.

శా॥ ఓరీ! రావణనామదుష్టదనుజా! యోరీమదాంధా! జగ
ద్వీరగ్రామణియౌ రఘూత్తముని దేవిన్ జానకిన్ దెచ్చినా
వేరా! రాముని బంట; నాయెదుర నీయీ దౌష్ట్యముల్ సాగునే!
యారామన్ విడవేనిఁ జేకొనెద నీప్రాణంబు లో దుర్మతీ!

రావ: సీతా! నిన్నింకను వెట్టి వదలకున్నది. నీవు మొఱవెట్టుకొనుటయు, నీబోడిపక్షి నీపక్షమవలంబించి నన్నుఁ దాఁకవచ్చుటయుఁ గడుంగడు నాశ్చర్యముఁ గొలుపుచున్నవి. ఎవ్వరును సాయము చేయరారైరని వాపోవుచుంటివి. వలసినంత చెప్పి చేయించుకొనుము. (జటాయువును జూచి) ఓయిపక్షీ! యూఱక నీత్రోవ వెడలి పొమ్ము. లేకున్న నీకుత్తుక నాకత్తి కెఱచేసెదను.

జటా: ఛీ! పౌరుషహీనుండవై దొంగవై మోసమున నొంటినుండు స్త్రీల నెత్తికొనిపోవు నీవు నఱకువాఁడవును నేను నఱకించుకొనువాఁడనునా! అసురాధమా! నీచరిత్రమంతయు నేనెఱుంగుదును. జగత్పావనియగు సీతాదేవిని విడువుము. లేకున్న నాచంచువిక్షేపములఁ నీమేను చించి నీకండలు భూమిపై రాల్చెద. కృతాంతనిశాంతమునకు నిన్నతిథిగఁ బంచెద. (కొట్టుచున్నాఁడు.)

రావ: (క్రింద డిగ్గి) ఓరీ! నీగర్వము మేరమీఱుచున్నది. నేను బలవంతుఁడనై నాయిచ్చకు వచ్చినట్లు దీనిని జెఱఁగొనిపోవుచున్నాను. నన్నధిక్షేపింప నీవెవ్వఁడవు! స్వయముగా వచ్చి నాతోఁబోరఁజాలకున్న నారాముఁడు జగజ్జెట్టివగు నిన్నుఁ గావలియుంచి యీ సీతకు సాయముచేసినాఁడని నేను సంతోషించెదను. పొమ్ము. పొమ్ము. ఊఱక నాచేఁ జావకుము.

జటా: రావణా! నన్నొకరు కావలియుంచు టెందులకు! సత్యమునకును ధర్మమునకును పాతివ్రత్యమునకును నీవు కలిగించు భంగము చూచి సైరింపఁజాలక నిష్కలుషమైన క్షాత్రబలంబున నీయన్యాయమును మాన్చి యీసీతాదేవిని విడిపింప వచ్చితిని. పతివ్రతలగుస్త్రీలు సకలలోకపూజ్యలు. వారి కపచారముఁ గావించు వాఁడు దేశద్రోహియు లోకద్రోహియు నగును. ఏదేశమునఁ బురుషు లెంతకాలము స్త్రీలను బరమ పవిత్రమూర్తులని భావించి గౌరవపురస్సరముగ సంభావించెదరో యంతకాల మాదేశమునకు క్షేమము గలదు. అటుగాక స్త్రీలను జెఱచు తలఁపుదయించిన నాదేశ మంతటితో మఱుమాటలేక యున్నతి చెడి యధోగతి పాలగును. స్త్రీలు పరమ పూజ్యలు. స్త్రీజాతిలేక ప్రపంచమున నొక్కపురుషజాతియున్న లోకవృత్త మెట్లుండునో యోజింపుము. పురుషప్రకృతియందలి యుడుకును జల్లార్చి లోపములఁ దొలఁ

గించి యపారసౌఖ్యముఁ గలిగించుటకై దయామయుఁడైన యీశ్వరుఁడు స్త్రీజాతిని సృజించియున్నాఁడు. పూజ్యస్వభావముగల స్త్రీల నెవ్వఁడు భక్తితో నారాధించునో వాఁడు మాతృభక్తుఁ డగును. దేశభక్తుఁ డగును. అట్లుగాక నిర్లక్ష్యభావమునఁ దృణీకరించి మోహమునఁ గన్నుగానక పైఁబడి మదమునఁ జెఱపఁజూడువాఁడు మాతృద్రోహియు దేశద్రోహియు దైవద్రోహియు నగును. స్త్రీలు స్వాభావికముగ నబలలు. పురుషులు బలవంతులు. అట్లగుట స్వస్త్రీలకె కాదు. పరస్త్రీలకైనఁ గడకుఁ శత్రుస్త్రీలకైన నాపద వాటిల్లినవేళ వారికి సాయ మొనరించి యాపదఁ దొలఁగించి యుపచరించుట మానవుని ప్రథమధర్మము. మీరాక్షసవంశజులలోనైన నీయది యకార్యమని భావింపఁబడకపోదు. నీవు మిక్కిలి యన్యాయ మొనరించితివని నీ యంతరాత్మయైన నెఱుంగకపోదు. ధర్మమనునది మానవులకు వేఱుగను రాక్షసులకు వేఱుగను నుండదు. రాక్షసులకుమాత్ర మంతరాత్మలులేవా! ప్రేమము దయయు లేవా! సుఖదుఃఖములు లేవా! ఎవ్వరు నీ కాప్తులు బంధులు నీప్రాణమునకుఁ బ్రాణములనుకొందువో యట్టి నీరాక్షసులే నీప్రవర్తనమునకై మనంబున నేవపడుచుందురు. నీపాలనమున వారికిమాత్ర మేసౌఖ్యము గలదు. నీబంధుఁడో నీయాప్తుఁడో కడకు నీతమ్ముఁడో కుమారుఁడో యెవ్వఁడో యొకఁ డొకసుందరాంగిని వివాహమాడినను లేక సౌందర్యవతియగు నొకపుత్రికను గన్న నేదిన మేగడియ యేనిమిషము నీచూపులాకాంతపైఁ బ్రాఁకి నీవామె పైఁబడి చెఱఁగొనిపోదువోయను భయమున ముప్రొద్దును వారు నీమరణమునకై యెదురుచూచుచుందురు. మృదువర్తనియగు నొకచెల్లెలు నీకుండిన నీవు నిర్మలహృదయముతో నామెను సమీపించినను దన్నెక్కడఁ జెఱపెట్టఁ దలఁచి వచ్చితివోయని నిన్ను సంశయించి భయపడకపోదు. అప్ప-సెల్లెండ్రకును, గన్నతల్లికిని నీయీప్రవర్తనము హేయముగ నున్నదనిన నిఁక లోకములోనివారి కెట్లుండవలయును! అంతయేటికి! నీకొక భార్య గలదుగదా! నీకన్న దుర్మార్గుఁ డొకఁడు వచ్చి నీభార్యనే చెఱఁగొనిపోయె ననుకొనుము. అది నీమనస్సునకు సమాధానము నొసంగునా! అన్యాయమని నీకుఁ దోఁపదా! ఇతరులు తనయెడ నెట్లు ప్రవర్తింపవలెనని కోరునో తాను నితరులయెడ నట్లే ప్రవర్తించుట మానవునకు విధియై యున్నది. ఈసీతాదేవి శ్రీరాముని ధర్మపత్ని. ఆరామచంద్రుఁడు చతుర్దశభువనగురుఁడు. అట్టి రాముభార్య నాకే గాదు. నాకును నీకును సమస్తలోకములకును జనని యగును. ఈమెను నీవు గొనిపోవుట కన్నతల్లిని జెఱఁగొనిపోవుటయే. ఉన్నవిధమంతయుఁ దెల్లముగఁ జెప్పితిని. ఇంతటితోనైనఁ దెలిసికొని సత్పథమునఁ జరించిన సరియే. లేనిచో

నీపాపఫలము నిప్పుడ నాచే ననుభవించెదవు. నాకన్నులయెదుర సత్యమునకును ధర్మమునకును భంగము కలిగిన నేనోర్చువాఁడఁ గాను. నిశ్చయముగ నోర్చువాఁడఁ గాను. కర్తవ్యమును నీవే నిర్ణయింపుము.

రావ: విహంగశేఖరా! నీయుపన్యాసము లితరసందర్భముల నితరస్థలముల సముచితములైనఁ గావచ్చునుగాని యిప్పుడు నాయెడఁ బనిసేయవు. అమూల్యమైన నాకాలమును నీకొఱకై వినియోగింపఁజాలను. ఒక్కఁడు తెలిపెద వినుము. నే నీసీతను విడువను. తప్పక లంకకుఁ గొనిపోవుదును. నీవు వృద్ధుఁడవైతివి. నీ వీ యరణ్యముల నెండకును వానకును గష్టపడఁజాలవు. నావెంట రమ్ము. నీకు సేనాధిపతిపదవి నొసంగెద. సర్వసౌఖ్యముల ననుభవించుచు నాప్రాపున గణ్యత వహింపఁగలవు. వినుము. త్వరితముగ వచ్చి రథము నెక్కుము.

జటా: ఛీ! తుచ్ఛబుద్ధీ! నీయొద్ద సేనాధిపత్యము వహింపుమన్నంతనే నే నుబ్బి తబ్బిబ్బై నీచేయుపాపకార్యమునకు సమ్మతింతు ననుకొంటివా! నీదనుజసామ్రాజ్యమంతయు లంకాపురముతోఁగూడ సమర్పించినను నావామపాదముతోనైన స్పృశింపఁజాలను. అంతకుమీఱి సబంధుపుత్రమిత్రముగ నీవును ముప్పొద్దును నాకు సేవచేయుచువన్ననొక క్షణమైన నిన్ను మన్నింపఁజాలను. నీయొద్ద నెంతటిమోసమైనఁ గలదు. నన్ను వంచింపఁ బ్రయత్నించుచున్నావా! మూర్ఖా! నా మేనఁ బ్రాణముండుదనుక నీ యీ కార్యము లవమైన సాగ నియ్యను. నాచే నీవు ప్రాణములు గోలుపోయి పరమదురాత్ముఁడగు రావణుఁడు నిహతుఁడయ్యెనని భారతదేశము సంతోషమునైనఁ బొందవలెను. లేదా! నీఖడ్గధార నేఁ దెగి యీజనస్థానమును నారక్తధారలచేఁ బునీతముగునట్లైనఁ జేయవలెను. నేను నిన్ను విడుచువాఁడఁగాను. నీ వీ సీతాదేవిని విడువకున్న నిశాతమైన మదీయవక్త్రాగ్రమున నీమేను చించి నీకండలు పక్షికులంబులు కడుపార మెక్కునట్లు చేసెద.

రావ: దుర్మదాంధా! నీకావరము నిన్ను సమయింపఁజేయును. ఎంత చెప్పినను మదీయ ప్రచండపరాక్రమజ్ఞానము నీకుఁ గలుగకున్నది. నీకు నేఁటితో నూఱేండ్లు నిండినవి. ఎన్ని యేండ్లనుండియో పెఱిగిన నీదేహమును నాచంద్రహాసము నిమేషమునఁ జీల్చి వేయును. రావణునితోఁ బోరుట తుచ్ఛములగు క్రిమికీటములఁ బొడుచుటగాదు.

సీ॥ భూమిపైఁ బురుగులఁ బొడిచి తినుటగాదు రావణుతో సంగరమ్ము సుమ్ము!
కుజమెక్కి గూండ్లలోఁ గూరుచుండుటగాదు; నాకారితోడి రణమ్ముసుమ్ము!

పృథివీధరములపై విహరించుటయుఁగాదు; పౌలస్త్యుబారిని బడుట సుమ్ము!
గగనభాగమ్మున నెగురుచుండుటగాదు దనుజేంద్రుతోడి యుద్ధమ్ము సుమ్ము!

గీ॥ తటుకుననను దిబ్బపైఁజిమగుటయుఁగాదు; కుంభకర్ణానుజన్ము మార్కొనుటసుమ్ము!
కన్నుసన్నల సకలలోకముల గెలుచు। కడిమిగల నన్నుఁదాఁకు శూరుఁడవె పక్షి!

జటా: భువనవంద్యచరిత్రుని నన్ను హీనముగ మాటాడుచుంటివా! జగత్పావనియగు సీతను జెఱగొనిన నీవు నన్ను గౌరవింతువా! మాతృద్రోహి కెవ్వరును గౌరవార్హులుగఁ గనఁబడరు. ఓరీ! రావణా! నాకార్యములు హీనములుగాని నీచేయు కార్యములు త్రిభువన స్తవనీయములు.

సీ॥ జేలతో మునుల గడ్డాలు పీకుటయుఁగా; దరుణజుతోడి సంగరముగాని!
మఱిమఱి యజ్ఞముల్ చెఱచుటగాదు; జటాయువుతోడి కయ్యంబుగాని!
స్త్రీల మోసమొనర్చి చెఱఁగొనుటయుఁగాదు; ఖగనాథుతో నెదురగుటగాని!
మధుపానమున నెడల్ మఱచుటగాదు; సంపాతితమ్ముని బారిఁ బడుటగాని!

గీ॥ తొడరి కొండలు బండ లెత్తుటయుఁగాదు; గురుబలోన్నతు నన్ను మార్కొనుటగాని!
బ్రహ్మ సీతాత్మైన గెల్వంగఁజాలు। వాని రావణా! నన్ను గెల్వంగఁగలవె!

రావ: మదీయదుర్వారపరాక్రమవిహారములు నీకు విపరీతముగఁ దోఁచుచున్నవా! నిన్నర క్షణంబునఁ దుదముట్టించెద.

మ॥ రజతాద్రిన్ బెకలించివైచితి; సురవ్రాతమ్ములన్ గెల్చి ది
గ్విజయంబున్ బొనరించితిన్; ద్రిజగముల్ గీర్తించె నాపేరు; శు
ద్ధజడున్ బక్షిని నిన్ను గెల్చుట యసాధ్యంబౌనె! యీనాఁడు నీ
భుజగర్వంబు నడంతు బక్షినివహంబుల్ శీర్షముల్ వంపఁగన్.

జటా: రావణా! నీవిజయములును విజృంభణములు నివియేగావుసుమా! ఇంకను మిగిలియున్నవి.

సీ॥ అలుకమై యముని సంయమునిపై కేగి క్రోపుకు నడినట్టి నీరుఁడవుగావె!
విక్రమాంకుఁడు కార్తవీర్యార్జునుఁడు చెంప లూడఁగొట్టిన గుణాఢ్యుఁడవుగావె!
చంద్రుపై దండెత్తిచని దెబ్బలనుదిని కదలివచ్చిన మానఖనివిగావె!
వాలి బల్మినిబట్టి వార్ధు లన్నిఁట ముంచి విడువఁగా మనిన ధీరుఁడవుగావె!

గీ॥ యడలి బలి కోడినట్టి యోధుఁడవుగావె! యంతయేటికి! దెలిదీవియం దబలలు పదితలలపుర్వు దీనిఁ జంపకుఁడటంచు। విడుచనమను నసహాయ శూరుడవుగావె!

రావ: ఏమీ! త్రిలోకవిజేతనగు న న్నెత్తిపొడుచుచున్నావా! ఇదె మదీయకరవాలధార నిప్పుడే పడితివి. (వేయుచున్నాఁడు.)

జటా: (తప్పించుకొని) ఇదె నీకంఠముఁ గాపాడుకొనుము. (పొడుచుచున్నాఁడు.)

రావ: ఇదె కూలితివి. (కొట్టును. జటాయువు పడును) తుచ్ఛపక్షీ! నన్నెదిరించినందుకు ఫల మనుభవించితివి. ఇచ్చటనే చావుము. నీకండలను నీపక్షికులములే భక్షించును.

సీత: (త్వరితగతి సమీపించి.)

గీ॥ కూలితే! మేరుశిఖరంబు కూలుమాడ్కిఁ। బొలిసితే నాదుపుణ్యంబు పొలియునట్టు!
లక్కట! పతంగశేఖరా! యాహవోర్వి। భయదరాక్షసాధము కరవాలధార.

అరుణతనయా! నీస్థితి చూచిన నాహృదయము వ్రయ్య లగుచున్నది. మందభాగ్య నగు నాకొఱకు నీవేల యాక్రూరదానవునిఁ దాఁకితివి. ప్రాణాపద దెచ్చికొంటివే! నన్ను దైత్యుఁడు చెఱఁగొనిపోయిన నీశ్వరానుగ్రహముండిన రామచంద్రుఁ డేనాఁటి కైన వచ్చి విడిపింపవచ్చును. కాని తండ్రీ! యెవ్వరు నీకుఁ బ్రాణ మొసంగుదురు! అయ్యో! నీయెద వేగముగఁ జలించుచు నీకుఁగలిగిన యాయాసభరము దెలుపు చున్నదే! నీవె ట్లురగన్ను వెట్టుచున్నావు! అకటా! నాముందఱనే దీర్ఘనిద్ర నొందు దువా! యేమి!

జటా: అమ్మా! తడవుగఁ బోరినందున నట్లున్నదేకాని నిజముగ నాకొక ప్రాణభయము గలదా! విశేషముగ నెద చలించుట కిప్పుడు కలిగిన రక్తపాతము కారణము. తల్లీ! నేను మహాసత్త్వసంపన్నుఁడనే! ఈస్వల్పఁపుగాయములు నన్నేమి చేయును! కొంచెము విశ్రమించిన నెప్పటిబలమును గలుగును.

రావ: సీతా! యాలస్య మగుచున్నది. త్వరితముగ రమ్ము.

జటా: తల్లీ! యాక్రూరదానవుని ధ్వని వినఁబడుచున్నది. అయ్యో! నాకన్నులముందరనే యొక పచ్చిరక్కసుఁడు జగత్పావనివగు నిన్నేకవచనమునఁ బిలువ వినుచు, నిన్నెత్తి కొనిపోవఁ జూచుచు నాచంచువిక్షేపముల నద్దురాత్ముని మేను చింపఁజాలక వానిని దండింపఁజాలక కడకుఁ గదలఁజాలక యిట్టి యవశస్థితిఁ బడియుండుటకంటె నాదైవ మొక గొప్పపిడుగును నాశిరమునఁ బడవైచియుండిన నేను సంతోషముతోఁ బ్రాణ ముల విడిచియుందును. వీనిదుర్వాక్యములు విని నాహృదయము దహించికొనిపోవు చున్నది. ఓరీ! రావణా! (అని యాయాసముతో నొరగును.)

సీత: పరాక్రమింపకుము. దురంతవిషాదముఁ గూర్చు నాపరిభవమునకై వగచి యింకొక

మా తాయసురపైఁ బోకుము. అయ్యా! నీవు శతవృద్ధుడవు. నిరాయుధుఁడవు. ఇప్పటికే పెక్కుగాయములచే క్షీణబలుండ వైతివి. వాని నడ్డగింపకుము. అయ్యో! నీవు సత్య పథసంచారివి. సత్య మున్నయెడ దైవ ముండును. దైవము నీకుఁ దప్పక సాయము చేయునని నమ్మియుంటినే. అయ్యో! యింకెక్కడి సత్యము! ఇం కెక్కడి ధర్మము! ఓయీశ్వరా! నీస్వరూపమయిన సత్యమున కిట్టి గతి పట్టిన నిఁక జగజ్జనులు సత్యపథము నెట్లాశ్రయింతురు.

జటా: తల్లీ! సత్య మెప్పటికైన సత్యమే! సత్యమునకుఁ గల బలము నెవ్వరును దప్పింపఁ జాలరు. ఏలోకమునైనను సత్యము సత్యమే. ఈలోకమున దుష్టు లెంద ఱెన్ని దుష్ప్ర యత్నము లొనరించి యెన్ని విధముల గ్రుంగఁదీసిననుఁ గడకు జయించునది సత్యమే. అమ్మా! న న్నీ యాపద లేమియుఁ జేయఁజాలవు. కడపటి యూపిరి యున్నంతకు నీవిముక్తికై పాటుపడుచుండెదను. శీఘ్రముగ రామచంద్రునకు నీవిషయమై యెఱిం గించెద.

రావ: సీతా! నీవు నామాట వినిపించుకొనక కాలహరణ మొనరించుచున్నావు. ఈపక్షి బ్రదికియున్నంతకు నీవు మాటాడుచునే యుందువు. ఈగదాదండమున నీనితల బ్రద్ద లగునట్లు మోదెద. (ఎత్తుచున్నాఁడు.)

సీత: (అడ్డము వచ్చి) దురాత్మా! వలదు. నీగదాప్రహారము నాశిరమునఁ బడనిమ్ము.

రావ: సీతా! నీమార్గ్యము పెఱుఁగుచున్నది. ఇదె నిన్నెత్తికొని పోయెద.

(పట్టుకొనుచున్నాఁడు.)

సీత: హా! రామచంద్రా!

చ॥ ఇరువదిచేతులన్ గవిసి యీదనుజాధముఁ డీయనాథ నన్
ఱెఱిగొనిపోవఁజొచ్చె; రఘుశేఖర! ప్రాణము తల్లడిల్లె; నీ
చరణములాన నే బ్రదుకఁజాల; మహోగ్రనిశాతసాయకో
త్కరములు గుప్పి వీని పదికంఠములన్ దునుమాడ రాఁగదే!

చ॥ అనుపమయజ్ఞసంభవము నాగమపూతమునైన పాయసం
బు నకట! కుక్క ముట్టినటు పుణ్యసతీమణి నన్నుఁ దాఁకె వీఁ
డనిమిషులార! దివ్యమునులార! యధర్మము మాన్చి ధర్మము
న్మనుపరె! రామచంద్రు సతి నన్ దయఁ బ్రోవరె; దైత్యుఁ ద్రుంపరే!

హా! రామచంద్రా!

(అప్పుడు రావణుఁడు సీత నెత్తుకొని యాకాశమున వెళ్లుచున్నాఁడు.)

జటా: ఓరోరి! దురాత్మా! కాలపాశము మెడను జుట్టుకొనుచున్నావు. మృత్యువు నాలింగన మొనరించుచున్నావు. దైత్యాధమా! నీవు తెగుట నిశ్చయము. సీతాదేవిని విడువుము...అయ్యో! మూర్తీభవించిన భారతదేశపాతివ్రత్యము. స్త్రీరూపము నొందిన యార్యావర్తపావిత్ర్యము. సకలసద్గుణలక్ష్మి. సీతాజనని యీదేశము విడిచి పోవుచున్నది. నిశాతచంద్రహాసమున దేహమును దునియలు తునియలుగఁ జీల్చినట్లు, హాలాహలము పుట్లకొలఁది యుదరమునఁ బోసినట్లు, యీశోకము నాప్రాణమును గొనుచున్నది. అయ్యో! యిన్నిగాయములు చేసిన యారావణుఁడే నన్నుఁ దుదముట్టఁజంపి యుండిన నాకీ వేదన లేకుండెడిది. అయ్యో! యేమి చేయుదు! పర్ణశాలలో సీతాదేవిని గానక వెదకుచు రామలక్ష్మణు లీవైపునకు వచ్చిన నీఘోరవార్త వారి కెఱిఁగించి ప్రాణములు విడిచెద. (శ్రవణము నభినయించి) ఎక్కడనుండియో ధ్వని వినఁబడుచున్నది. (నిక్కి చూచుచు) ఇరువురు మనుజులు వచ్చుచున్నారు. పోలికఁబట్టి చూచిన రామలక్ష్మణులవలెఁ గనఁబడుచున్నారు. దైవమా! నామిత్రుని కుమారుల కెట్టివిపత్తు గలిగించితివి! క్షణక్షణదుర్బలమగు నీ దేహముతో వారియొద్దకు వెళ్లఁ జాలను. ఈవృక్షచ్ఛాయ నిలిచి వారియాగమనము నిరీక్షించుచుండెద.

(అట్లుచేయును. రామలక్ష్మణులు దూరమునఁ బ్రవేశించుచున్నారు.)

రాము: ఉ॥ హా! జలజాక్షి! హా! దశరథావనినాయకు పెద్దకోడలా!
హా! జనకక్షితీశ్వరుని యర్మిలి కూతుర! హా!మహీసుతా!
హా! జగదేకసుందరి! మహాభయదాటవులందు నన్ను నీ
యోజఁ ద్యజించి పోవఁ దగునో! నినుఁబాసి మనంగ నేర్తు నే!

జనకతనయా! భవద్వియోగ జనిత సంతాపానలము నను సజీవముగ దహించుచున్నది.

శా॥ నీనామంబు జపించు మానసముతో; నీమోముఁజూడంగ నెం
తే నాసించెడు లోచనద్వయముతో; నిన్ బాసి తా నర్థహా
యీ నా దేహముతో; వ్యథాతురుఁడనై యెట్టెట్టులో ప్రాణము
న్నేనన్ నిల్పితి; దర్శనం బొసఁగవేనిన్ నిల్వదీ దేహముల్.

ల: దేవా! యెన్నికష్టములయినఁబడి సీతాదేవిని మన మారయవలయునుగదా! నీకై నీవు ధైర్య మవలంబింపకున్న నే బోధింపఁగలవాఁడనా!

రా: లక్ష్మణా! యెంతప్రయత్నించినను ధైర్యము నిలువకున్నది. నాధైర్యగాంభీర్యాది గుణ

గణములన్నియు సీతవెంటనే పోయినట్లున్నవి. సుప్రసన్నమై కళానిధానమై ముద్దులొలుకు సీతామనోహరవదనబింబము నామనస్సున నిమిషనిమిషము పొడకట్టి మఱువనీకున్నది. నాదేహబలము క్షీణించినది. నీవు ముందు నడచుచుండఁ గేవలము ప్రయత్నముతో నడుగిడుచుంటినేకాని త్వరగ నడచుటకుఁగూడ నాకు బలము లేదు.

ల: అయ్యో! యుత్సాహములు మనల నెప్పుడో విడిచిపోయినవి. కాని చింతించి మనము చేయునదిలేదు. దురంతదీర్ఘవిచార మున్నబలమునుగూడ క్షీణింపఁజేయును. చేయవలసినకార్యములఁ జేయనీయదు. ఎంతటి ప్రయత్నముతోనైన నీవనమున వెదకుదము.

రా: అట్లే చేయుదము. (నడచుచు) లక్ష్మణా! తన సద్గతిచెడి భూమిపై రాలు నక్షత్రమువలె నీ కుసుమదామము నేలపైఁ బడినది. నిర్జనమయిన యీగహనమున నీపుష్పమాల గనుపించుట కేమికారణమో! (అని తీసికొని చూచి) సౌమిత్రీ! నేను దురదృష్టవంతుఁడ.

గీ॥ క్షోణితనయ పూజ్యంబైన క్రొమ్ముడిపయిఁ। బొదలుచును జెక్కుచెదరని పుష్పమాల
గతిచెడి ధరిత్రిఁబడె నిజకాంతిదొఱఁగి;। యక్కటక్కట! నా యభాగ్యంబు కతన.

(అక్కునఁ జేర్చుకొనుచున్నాఁడు.)

ల: రామచంద్రా! సీతాజనని ధరించు పుష్పమాల యిచటఁ గనఁబడినందున నామె యీ ప్రదేశమున నెందైన నుండునని తోఁచుచున్నది. వెదకుదము.

రా: సౌమిత్రీ! యిచ్చట బహువిధములగు పాదరేఖలు కనఁబడుచున్నవి. ఒకజత యడుఁగులు మిక్కిలి పెద్దవి. అవి మహాకాయుఁడగు నొకబలాఢ్యుని పాదరేఖలని తోఁచుచున్నది. ఆచిన్నిపాదముల గుఱుతింపఁగలవేమో చూడుము.

ల: (కూర్చుండి) సప్తసముద్రములు నుప్పొంగి వచ్చి నను ముంచివేయుచున్నవి. అయ్యో! దృష్టి బలహీనమై కనులు సరిగఁ గనుపించుటలేదు. (అని కనులు మూయును.)

రా: క॥ పదరేఖ చూచి తెలియవు!; కదలవు; ననుఁజూడ; వౌను కాదన; వశ్రుల్
మెదలెడిఁ గన్నులఁ; దమ్ముఁడ! మది యేలకలంగె! దెల్పుమా! శీఘ్రముగన్.

ల: దేవా! యీపాదములు సకలకల్యాణప్రతిపాదకములు. నిఖిల సల్లక్షణాంచితములు. దినదినమును నాచేతులతో నమస్కారము లందినవియే.

రా: ఆతక్కిన పాదరేఖలు తప్పక యొకరాక్షసహతకునివై యుండును. లక్ష్మణా! సీత నెవ్వఁడో యొకక్రూరదానవుఁ డెత్తికొని పోయినాఁడు. అకటా! యాధరణీసంజాత యాజనకరాజతనూజ లేక నే నెట్లు బ్రదుకుదును!

ల: దేవా! యిచ్చటికి రాఁగా నింతవఱకుఁ దెలిసినది. ఇంకను వెదకుదము. ఈపరిసరవర్తులగు మునులను నాటవికుల నడుగుదము.

రా: (కోపావేశమున) ఎవ్వరి నడుగవలసినదిలేదు. సర్వము తెలిసియేయున్నది. అంతయు ముగియవచ్చినది. తండ్రియానతినై సామ్రాజ్యము విడిచి జననుల నెడఁబాసి సోదరులకు దూరమై మిత్రులను బంధువులను బరిత్యజించి యరణ్యములఁ బ్రవేశించి మునులవలెఁ గాలముఁబుచ్చుచు లోకమునకు హితము గావించుచుండ, నీకాననములలో నాకు దుఃఖసహాయయై నావెంట వచ్చిన సకలసద్గుణోపేత జనకసుత సీత నెవ్వఁడో దుష్టుఁడెత్తికొనిపోవ నీపంచమహాభూతము లుపేక్షవహించెను. కాని యామెను విడిపించి నా కర్పించి సౌఖ్యముఁ గలిగింపవయ్యె. త్రయస్త్రింశత్కోటిదేవతల ప్రార్థనమున సకలభువనభారము మాన్ప దశరథసుతుఁడనై జనియించి లోకరక్షణభారము శిరమునఁ దాల్చి యుదారవర్తనమున మెలంగు నన్ను దేవతాచక్రవర్తియు సకలసురలు చంద్రసూర్యులును యముఁడును దివారాత్రములును నవగ్రహములును దారకలును మునులును సకలభువనములు నొకహీనునివలెఁ జూచునట్లున్నది. సోదరా! నా కిట్టి భంగము కాఁదగినదా! చతుర్దశభువనము లెత్తివచ్చినను క్షణమున నిర్మూలింపఁజాలు నన్నిట్లు చూడఁదగునే!

మ॥ అతివేగార్భటితోడఁ బెల్లలము దావాగ్నిక్రియన్ లోకసం
తతులన్ గాల్పఁగనోపు చండతర మత్కల్పాంతకోపాగ్ని వృ
క్షతతుల్ శైలము లాశ్రమంబులు జనస్థానంబు వింధ్యంబు భా
రతదేశంబు సమస్తమున్ నిమిషమాత్రన్ భస్మమున్ జేసెదన్.

సౌమిత్రీ! చతుర్దశభువనభయంకరంబయిన నాశరాసనమును మోపెట్టి వజ్రసంకాశక్రూరనారాచము సంధించి యీలోకమునంతయుఁ జూర్ణముఁ గావించెద. అప్పుడైన బ్రహ్మాదిదేవతలు చేతులు మోడ్చి నాప్రణయనిధానను నాముద్దులాడిని నా సీతను దెచ్చి యర్పింపకపోదురేమో చూచెద. అట్లర్పింపకపోయిన దిక్పాలురతోడను త్రిమూర్తులతోడను ముప్పదిమూఁడుకోట్ల దేవతలను సంహరించి స్వర్గమును నాశ మొనరించెద. సప్తాధోలోకములను సప్తోర్ధ్వలోకములను బిండిచేసి బ్రహ్మాండమునం దంతట నిండి ప్రళయకాలరుద్రునివలె వెలింగెద. లక్ష్మణా! యీమహాధనువును నీవుంచుకొనుము. ఈస్వల్పకార్యమునకు ధను వేటికి! కటాక్షమాత్రమున సకలభువనముల నీరుచేసి నే నొక్కఁడనే నిండియుండెద. (విజృంభించుచున్నాఁడు.)

ల: దేవా! లోకశరణ్యుఁడవయిన నీవు రక్షోగణములఁ బరిమార్పవలయుఁగాక. ప్రళయ కాలాగ్నివోలెఁ జెలరేఁగుచున్న కోపాగ్నిచే లోకములఁ దల్లడిల్లఁజేయుట భావ్యమా! అన్నా! సీత నెవ్వఁడో యొకక్షుద్రుఁడు దుర్మార్గుఁ డెత్తికొనిపోయి యుండును. అట్టి దుర్మార్గుఁ డొనరించిన యొకకృత్యమ జగజ్జాలముల నీరుచేసిన నేమగును! అప కారముచేసినవాఁ డొక్కఁడును జెడిపోవునవి సకలలోకములునా! ఈపంచభూతము లును బర్వతములును సానువులును బవిత్రమగు భారతదేశమును మన కపచారము నైనఁ జేసియుండలేదే! వీనిపై నేల కినియవలయును! ఈపరిసరవనములందును నికుం జములందును వెదకుదము. ఎచ్చటను సీతాదేవి కనఁబడకపోయిన నప్పుడే దేని భయం కరకార్య మొనరించుదము. మనకు వాటిల్లిన యీయాపద యెంతకాల ముండును! నేఁడుగాకున్న రేపయిన సీతను జూడమా! ఆమె విపత్తును దొలఁగింపమా! దేవా! దక్షాధ్వరధ్వంసమునాఁటి రుద్రునివలె నీవు రౌద్రముఁ బూనియున్నావు. నీశాంతి ం లోకములకు శాంతము. నీవిశ్రాంతి లోకములకు విశ్రాంతి. నీరౌద్రము జగత్ప్ర యము. దుర్నిరీక్ష్యమైన నీరౌద్రతేజము నాకు భయముఁ గొలుపుచున్నది. దేవా! ఏల! దీ కోపము. ఈకోప ముపసంహరింపుము. నా కభయ మొసంగుము.

రా: లక్ష్మణా! నీశాంతవచనములచే నాకోపము తగ్గినది. అయిన జనకజ యెచ్చట నున్నది! ఎచ్చట మన మామెను జూడఁగలము! ఏమార్గమునఁ బోవుదము! ఏమి చేయుదము!

ల: ఈవనమున మునుల నడుగుదము. మున్ముం దొకదారుణారణ్య మున్నది. అందు వెదకుదము.

రా: కానిమ్ము. (నడచుచు) ఈ భాగముఁ దిలకింపుము. క్రొన్నెత్తుటఁ దడిసి యున్నది. అచ్చటచ్చటఁ గండలు రాలియున్నవి. ఆవృక్షముక్రింద నొక పక్షి కూర్చుండి యున్నది. కుమారా! ఒకానొక రాక్షసుఁడు జానకిఁ బట్టితెచ్చి యిచ్చటఁ జంపి భక్షించి మనము వచ్చు సవ్వడి విని భయపడి పక్షిరూపము ధరించి యిందుఁగూర్చుండి యుండ నోపు. వీని నిప్పుడె మదీయబాణములపాలు గావించెద. (ధనువు నెత్తుచున్నాఁడు.)

జటా: దేవా! రామచంద్రా!

రా: లక్ష్మణా! యీపిలుపుసవ్వడి మిక్కిలి పరిచితముగఁ దోఁచుచున్నది.

జటా: లక్ష్మణా! యన్నగారిని బిలిచికొని రమ్ము.

రా: (నడచుచు) తమ్ముఁడా! యితఁ డరుణపుత్రుఁడు జటాయువు కాఁడుగదా!

జటా: నేను జటాయువునే! రండు. మీదివ్యదర్శనభాగ్యముఁ బ్రసాదింపుఁడు. దేవా! రావ ణుఁడను రాక్షసుఁడు సీతాదేవి నెత్తుకొని పోవుచుండఁ జూచి వానినిఁ దాఁకితిని.

...మిత్రి! మనచరితమంతయు నీమహాశయున కెఱింగింపుము.

చిత్రము. (హనుమంతునితో.)

సీ॥ దశరథుసుతుల మీతఁడు రాముఁ; డేను లక్ష్మణుఁడను; జనకాత్మజ జరప నేను
వదినెయు మాయన్న పదునాలుగబ్దముల్ వనవాస మొనరింప వచ్చియుంటి;
మామహాదేవియు నీమహాత్ముఁడు పర్ణశాల నుండఁగ మృగశాబ మొండు
గనుపించె; దేవియుఁ గాంక్షించె; మేమామృగంబుఁ దేఁబోవ రాక్షసుఁడొకండు

గీ॥ వనితఁ జెఱగొనిపోయె; నామెను వెదకుచు। నిట్లురాఁగ జటాయువు ఋశ్యమూక
మందు సుగ్రీవుతోడ సఖ్యంబు నెఱపుఁ। డనిన నిటువచ్చియుంటి మో యగచరేంద్ర.

ఇప్పుడు ఋశ్యమూకమునకు వచ్చువారమై చక్కనిమార్గముఁ జూపుమని నిన్నడుగవలెననియుంటిమి. నీవెవ్వఁడవో యెఱింగించి ఋశ్యమూకమునకు మార్గముచూపుము.

హను: సూర్యపుత్రుఁడగు సుగ్రీవుఁడు కొంతకాలమునుండి ఋశ్యమూకమున వసించుచున్నాఁడు. ఆసమీపమునఁ గనబడునదియే ఋశ్యమూకాద్రి. నేను సుగ్రీవుని మంత్రులలో నొకఁడను. వాయుదేవున కంజనాదేవికిని బుత్రుఁడ. నన్ను హనుమంతుఁడందురు. పంపాసరోవరసమీపమునఁ దిరుగుచుండ మిమ్ముఁజూచి మీయుదంత మెఱింగిరమ్మని సుగ్రీవుఁ డనుపఁగా నిందు వచ్చియుంటిని. మీరు నావెంట రండు. మిమ్ముఁ దోడ్కొనిపోయి మాస్వామికిని మీకును సఖ్యం బొడగూర్చెద. దేవా! రామచంద్రా! నీదివ్యచరితము నాకుఁ జిరస్మరణీయము.

మ॥ జనకక్ష్మాధవుకూర్మిపెండ్లికొడు కాసర్వజ్ఞుబాణాసనం
బును భేదించినమేటి యాపరశురాముల్ దాఁకి మెప్పించు పా
వనశౌర్యాఢ్యుఁడు విష్ణుచాంశజుఁడు విశ్వామిత్రుశిష్యుండటం
చని లోకంబులు నీచరిత్ర నుతిసేయన్ విందు రామప్రభూ!

పరబ్రహ్మమునెడ యోగిమానసము విధమున నిన్నుఁ జూచినంతనుండియు నా మనంబు నీచరణారవిందధ్యానమకరందము నాస్వాదించి యానందింపఁ గోరుచున్నది. అనుగ్రహముంచి నన్ను నీసేవకునిగఁ బరిగ్రహింపుము. (నమస్కరించుచున్నాఁడు.)

రా: (లేపి) హనుమంతా! నీయాగమనము నాకు సంతోషప్రదము. హృద్బంధునివలె నిన్నాదరించెద. నా యీ విపత్సముద్రమునకు నావవై నాయలమటఁ దొలఁగింపుము.

హను: మహాప్రసాదము. నేను ధన్యుఁడనైతిని.

స్వామీ! నీయాజ్ఞ లవముఁ గొండగ భావించి విధేయుఁడనై చరించెద. మేరువంటటి

ల: దేవా! నవవికసితారవిందసౌరభములఁ దొప్పఁదోఁగి మలయగంధవహుఁడు సార్థ ముఁడై యిందు విహరించుచున్నాఁడు. ఈసరసీతటమునఁ గొంతవడి విశ్రమించి పిదపఁ బయనింతము.

రా: సౌమిత్రీ! యీకమలాకరసౌందర్యమును మందమారుతప్రసారమును భార్యాసమేతు లగు భాగ్యవంతులకు సంతోషము నొసంగును. నావంటి వియోగాతురులకు ముదావహముగ నుండమి యట్లుండ మీఁదుమిక్కిలి సంతాపప్రవర్ధకముగ నుండును.

సీ॥ తరుణాంబుజంబు సుందరవదనంబుగాఁ; బద్మనాళంబులు బాహువులుగ;
రంగదుత్తుంగతరంగముల్ వళులుగాఁ; జక్రముల్ వలిగుబ్బచనులుగాఁగ;
గచ్ఛపంబులు జంఘికాయుగళముగాఁగ; నురుసౌరభంబు నిట్టూర్పుగాఁగ;
సురుచిరపులినముల్ శ్రోణియుగ్మముగాగ; శైవాలములును గేశములుగాఁగ;
గీ॥ లలితపంపాసరోవరలక్ష్మి నాకు। జానకీదివ్యరూప దర్శన మొసంగి
యగణితవియోగతాపాగ్ని రగులఁజేసి। హృదయముదహించుచుండెసుమిత్రాకుమార!

ఈపంపాసరోవరసమీపవనమునందలి లతలును కోమలాతికోమలములగు చివుళ్లును బుష్పములును ఫలములును జనకతనయామనోహరమృదులాంగకముల జ్ఞప్తికిఁ దెచ్చి నన్ను మఱింత కుందించుచున్నవి.

ల: అట్లయిన నిప్పుడ కదలుదము. ఈసాయంతనమున కెట్లో ఋశ్యమూకముఁ జేరుదము. ఎవ్వఁడో యొక పురుషుఁ డీమార్గముననే వచ్చుచున్నాఁడు. ఇతని నడిగి ఋశ్యమూకమునకుఁ ద్రోవ నెఱుఁగుదము.

ప్రవేశము- హనుమంతుఁడు.

శా॥ ఆకర్ణాంతములైన నేత్రములు దీర్ఘద్బాహుదండంబులుఁ
రాకాచంద్రనిభంబులౌ వదనముల్ రాణింప నున్నారు లీ
లాకందర్పనవావతారులన; నీలావణ్యపుంభ్రోవు లే
లోకాధీశులొ! లేక దేవతలె యీలోకంబునఁ డిగ్గిరో!

వినయముతో సమీపించి వీరివృత్తాంతముఁ దెలిసికొనెద. (సమీపించి) నిరుపమాన తేజోధాములగు నోపురుషసింహులారా! జగన్మోహనరూపములతో నుదార తేజోగాంభీర్యములతో లోకము లేలఁగలవారలుగ నుండి నీరసములైన నారలుగట్టి యీవనముల నేల క్రుమ్మరుచున్నారు! మీరెవ్వరో మీదివ్యచరితమెట్టిదో తెలిపిన విని యానందించెద.

ఉ॥ తనకనులొద్ద సత్యమును ధర్మము భంగమునొందఁ జూడలే
కనుపమశౌర్యధాటి నభియాతిని బిట్టుగఁదాఁకి భారతా
వనిని నధర్మలేశమును బత్తులుగూడ సహింపవంచు లో
కనికరముల్ నుతుల్ సలుపఁగా విహరించె నితండు త్యాగియై.

సౌమిత్రీ! సత్వరమ యేఁగి యావృక్షమునందలి విశాలపత్రములతో నొకవీవన సిద్ధము
సి తీసికొనిరమ్ము.

ము. (అని వెళ్లి వీవనతో వచ్చి)

ఖగేంద్రా! నీ వించుక సేపు న న్నానుకొని కూర్చుండుము. ఈవీవనతోఁ జల్లగ
రెద.

సౌమిత్రీ! యావీవన యిట్లిమ్ము. నీ నీ ఖగముఖ్యునకు సహాయుఁడవై కూర్చుండుము.
నేను విసరుచుండెదను.

యు. వలదు. దేవా! నీవు మహానుభావుఁడవు. విష్ణ్వంశసంభూతుఁడవు. పక్షిమాత్రుఁడ
న నాకు నీవంటిమహాభాగుఁ డుపచారముసేయుట భావ్యముకాదుసుమా! ఊరక
టూడుచుండుము. నా కదియే స్వర్గసౌఖ్యము.

ంగపుంగవా! నాకు దశరథుఁడొకఁడును నీవొకఁడునా! ఇపుడు నేఁగష్టపడునది
ు! వీవనతో విసరుట యేకదా! ఇంతమాత్రము సేవ నాయెడనుండి నీవు గైకొనఁ
దా! విశుద్ధమనస్సుతో నుపచరింతునే! అయ్యో! యంతకంతకు నీయాయాస
డగుచున్నదే! నీవక్షోభాగ మెల్లగిరిపడుచున్నది!

ు చంద్రా! నాకై నీవు చింతింపకుము. ఇప్పటికే నేను శతవృద్ధుఁడ బ్రదికినంత
ము బ్రదుకఁబోను. మఱియు నిపుడు నాకుఁ దటస్థించిన మరణము వీరపురుషోచిత
నది. నేను సత్యపక్షమునను ధర్మపక్షమునను యుద్ధము చేసితిని. సత్యముకొఱ
ు ధర్మముకొఱకును బ్రాణములఁ గోలుపోవుచున్నాను. ఇంకెంతకాలము నేను
ంచియున్న నిట్టియుత్తమకార్యమునకై పోరాడి ప్రాణము విడుచు నవకాశము
కు లభింపదు. మఱియొక విశేషము. దనుజలోకముల శిక్షించి శిష్టుల రక్షింప నా
స్నేహితుఁడు దశరథునకుఁ గుమారులై పుట్టిన శ్రీమహావిష్ణుఁడవగు నీవును నీకె
ు పాన్పుగనుండు నాదిశేషుని యవతారమూర్తియగు నీమహానుభావుఁడు లక్ష్మ
ుఁను నిరువురు నాయవసానసమయమున నాయొద్దకు వచ్చి నేను వలదని
ము ప్రార్థించినను వినక జగత్పావనమైన మీ హస్త శరీర స్పర్శలచే
మిక్కిలి పునీతునిఁజేయుచు నుపచరింపఁ బూనితిరి. రామచంద్రా! నేను

కాని యీాదినము ధర్మమునకు బలము తక్కువై రావణుడు జయము నా [illegible]
తల్లి నెత్తికొని దక్షిణాభిముఖుఁడై వెడలిపోయె. ఈవార్త నీ కెటిగించుట
ముతో నుందునా యనుకొనుచుంటిని. నీదివ్యసందర్శన మైనది. నా క్రోధ
కొంతయు లేదు.

రా: అయ్యో! ఘోరహత్య చేయనుంటిని. పంచమహాపాతకులలోఁ జేరితిని. ఖగేశ్వరా! దశరథునిమిత్రుని దశరథునివలెనే మాకు మాననీయుఁడవగు గన్నుగానక యెత్తిన కోపమున సంహరింపఁ బూనితిని. అత్యంతపాతకమ (లక్ష్మణుని దిక్కై)

మ॥ అతివేలమ్మగు భూరికోపమున గర్వాంధుండనై శాత్రవు
హితునిఁ గుర్తెఱుఁగంగలేక మన కెంతేఁగూర్చు పూజ్యాత్ము
పతగశ్రేష్ఠుని జంపఁబూనిన మహాపాపిఁ గృతఘ్నుండ; నీ
శితఖడ్గంబున లక్ష్మణా! యిపుడు నాశీర్షంబు ఖండింపుమా!

జటా: రామచంద్రా! సీతావియోగదుఃఖమున మదికలఁగి పొరఁబడితివి. యెడ భేదభావ మున్నదా! దేవా వాత్సల్యపూర్ణమైన నీహృదయమ దీనికై నీవేల చింతనొందెదవు!

రా: అరుణతనయా! నీవు పక్షికులశేఖరుఁడవు. నీవృద్ధతయు సౌజన్యమును యాడఁదగినవి. అదిగాక నీవు నాజనకుని చిరాప్తమిత్రుఁడవై తండ్రివ నియుఁడవు. విశేషించి నాప్రాణపదమగు సీత యేమైనదియు నెఁ దెలియక యామె కేసాయముఁజేయలేని విషమదుర్దశయందు క్షాత్ర దాఁకి యామెను రక్షింపఁ బ్రయత్నించిన మహోపకారివి. ఇట్టి ఁ ణుఁడవగు నిన్ను రాక్షసుఁడని తప్పఁదలఁచి ఘోరబాణమున కొ నామనము పొగులుచున్నది. నాయెడఁగల వాత్సల్యమున నీవింత ెచ్చికొంటివే! అయ్యో! నీవెంతగ వగర్చుచున్నాఁడవు! నీవక్షమున దగిలి యీాప్రేటు నీహృదయకోశమువఱకుఁ బోయినదే! అయ్యో మా కే మున్నది!

దేవా! చింతింపకుము. ఆ... క్రూర... రాక్షసుఁడు

: ఖగాధిపా! కొంచెము విశ్రమింపుము.

లక్ష్మణా!

రదేవతాస్వరూపములందు నతిభక్తిఁ దలిదండ్రులనుగొల్చు ధన్యమతులు!
కున్న సర్వవిత్తప్రాణముల నిచ్చి దేశంబు సేవించు ధీరమతులు!
కినమాట తప్పఁగలేక మేనికండలు చెండియిచ్చు విజ్ఞానధనులు!
ర్తరక్షణము సేయంగఁ బ్రాణమునైన నర్పించినట్టి పుణ్యాగ్రణులును!
నెట్టిపుణ్యలోకంబుల నెట్టిదివ్య। సౌఖ్యముల నొందనేర్తు రాసౌఖ్యభరము
ప్రకటగుణజాలుఁ డీ పక్షిరాజునకును। గలిగెడినిగాత మత్పరిగ్రహముకతన.

(అంతట జటాయు వాకాశమున విమానారూఢుఁడై పోవుచున్నాఁడు.)

గా! భవదీయపరిగ్రహమున జటాయువు ప్రేతత్వనిర్గమనమునొంది యుత్తమలోక
న కరుగుచున్నాఁడు.

న్యుఁడా! యతఁ డర్హగౌరవమంది కృతకృత్యుఁడయ్యెను. ఈతనిచరిత్రము భారత
జనుల కాదర్శప్రాయ మగునుగాక.

శా॥ ఆర్యస్త్రీతిలకంబు దుష్టుఁడొకఁ డన్యాయంబ కొంపోవఁగా
శౌర్యక్షాత్రములొప్పఁదాఁకి విడిపింపఁ బోయి వ్యగ్రాక్షత; మహా
వీర్యం డీతనిఁజూడ ధర్మనిరతుల్ విజ్ఞానపారీణులున్
దిర్యగ్జాతులఁగూడ నుందురసి నిర్దేశింపఁబోలున్ జుమీ!

యఖండత్యాగము నెవ్వరైనఁ గొనియాడకపోరు. దేవా! యవ్వలఁ బయనింతము.
ర్యగతులు ప్రతికూలముగ నున్నవి. ఎక్కడి కేగుదము! ఎట్లీ దుఃఖాబ్ధి నీదుదము.
గేంద్రుఁ డవసానసమయమున సెలవిచ్చెఁగదా! ఋష్యమూకమున కేగుదము.
మన చెప్పిన మార్గము మన కవశ్య మనుసరణీయము. అట్లే పోవుదము.
! యిటు చూడుము.

పలయానిలాంకూరములు మందముగ వీచి వలితుంపురుల మొత్తములను జల్ల
క్షసితాంభోజకర్ణికలఁ గూర్చుండి తుమ్మెదలు మంజులరీతి రొదలుసేయఁ
వలి తూగాడు తుంగతరంగములపైన లీలమై నంచ లుయ్యాలలూఁగఁ
పల కొమ్మల నెక్కి పురివిచ్చి వనమయూరములు హేలానర్తనము లొనర్పఁ
పలపండువై కడుఁజల్లదనముఁగూర్చి। యాత్మ కత్యంతసుఖము నీయంగఁజాలు
మలవాఃపూరితంబై తనర్చు। నీసరోవరమును జూచితే! మహాత్మ!

గా! యి పంపాసరోవరము. ఇది సకలబృందారక సుందరీసందోహ విహార
స్థానము. అతి పుణ్యప్రదము. ఈకాసారదర్శనమున మనము ధన్యులమైతిమి.

న్యుఁడ నైతిని. ఇట్టి నాకై నీవేల శోకింపవలయు! [illegible]
మొనరించి సత్పురుషాగ్రగణ్యుఁడనియు లోకమాన్యుఁడనియుఁ బేర
థుఁడు మృతినొందెనే! అతనికన్న నే నెక్కుడా?

రా: అకటా! దుర్భరము. దుర్భరము.

ల: అకల్మషవర్తనుఁడై పెద్దకాలము మనిన యీపక్షినాథుని ప్రస్తుతస్థి
హృదయము కఱఁగిపోవుచున్నది. అయ్యో! యిట్టివానిని మేము పడ

జ: లక్ష్మణా! నేను విన్నవించుకొనినది రామచంద్రున కొక్కనికే కాదు,
గవనుండి జలజలరాలు బాష్పములు నాకొఱకు నీకయిన యపారశో
చున్నవి.

రా: లక్ష్మణా! నీవు శోకించి యాపూజ్యునిమానసముఁ గలంపకుము. ఊఱ

జ: దేవా! ప్రాణము నిజస్థానము వదలినది. ఋష్యమూకము... సుగ్రీవుఁ
రామా! రామా! రామా! (గతాసుఁ డగుచున్నాఁడు.)

ల: హా! పతత్రికులశిరోరత్నమా! దశరథరాజవిహితా! జటాయూ! (అవ్వ

రా: ఉ॥ ఓవిహగాధిరాజ! భువనోన్నత సద్గుణజాల! యో ర్తర
షావిధి సర్వముఁ దృణముగా గణియించిన ధీరు నిన్నుఁ దం
డ్రీ! విడఁదీసి కైకొనియెనే విధి! మమ్మొడఁబాసి స్వర్గల
క్ష్మీవిభవంబుఁ గోరి దివికిఁ జనినాఁడవె! శాంతపావనా!

లక్ష్మణా! కాష్ఠభారములఁదెచ్చి చితి సిద్ధముచేయుము. అగ్ని మ
నము గావింతము.

ల: చిత్తము. (వెళ్లును.)

రా: తండ్రివలె నరయు నీమృదుహృదయుఁడుగూడ మమ్మొడఁబాసిపోయె

ల: అన్నా! సిద్ధ మొనరించితిని.

రా: ఖగలోకనాథుని జితిపై ......

ల: పెట్టుచున్నాను. (పెట్టును.)

రా: (అగ్నిఁ దగిలించి)

గీ॥ ఉత్త [illegible] త్తమవీరుఁడ; వున్నతస్వ భావుఁడవు; భువనైకపావనుఁడ
నిన్ను నాచేతులార నగ్నిని దహింప వలసె; ఖగరాజ! నే నెట్టి
ఈపచ్చ [illegible] కడిమిడిపట్టున నీదర్భలపైఁ బిండప్రదానము గావించె

శత్రువు నైనఁ దృణప్రాయముగఁ జేసి డీలుపఱచెద. నాతలిదండ్రులయెడవలె వి యొద్దను మీదేవేరియొద్దను మెలంగెద. అధిపుఁడనిన రామప్రభుఁడనియు సహచరుఁ డనిన హనుమంతుఁడనియు లోకములు గొనియాడ వర్తించెదను. దేవా! నీవు నా గురుండవు. దైవంబవు. దుర్వారప్రతాపరాశియగు సీతమ్మగాఁడు లక్ష్మణుఁగు మున నన్నాజ్ఞాపించి పనులఁ గొనుచుండుము.

రా: ఆంజనేయా! విశ్వాసపాత్రుఁడగు నీయట్టి యనుచరుఁడు లభించుట నాభాగ్య షము. నాకు ముగ్వురు సోదరులు గలరు. నిన్ను నాలవవానిగఁ గైకొని యరసి చుండెద.

హ: నీయనుగ్రహము త్రిలోకీరాజ్యాభిషేకము. పరమపురుషుఁడవగు నో దేవా!

సీ॥ సౌమిత్రివలె గుణధాములై సోదరు లన్నయానతి కెదురాడనట్లు;
నీవలె బురుషులు నిజభామినులను సోదరులఁ బ్రాణమువోలె నరయునట్లు;
సీతామహాదేవి చెలువునఁ జెలులెల్ల సాధ్వులై పతిభక్తి జరపునట్లు;
లరుణాత్మజువిధానఁ బురుషులందరు సత్యధర్మదీక్షితులౌచుఁ దనరునట్లు;

గీ॥ జగతి దుష్టవర్తనులెల్ల సమయునట్లు। భరతఖండంబు శుభములు వడయునట్లు
భువనములు శాంతియుక్తమై పొదలునట్లు। వరము దయసేయవే రాఘవక్షితీంద్ర!

రా: అవశ్య మట్లు జరుగుఁగాక.

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్షవీక్షాసమాసాదిత రసవత్కావ్య
నిర్మాణచాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశదుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్రపవిత్ర, సుజనజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహావధాని
పంచానన, కావ్యకళానిధీత్యాది బహుళబిరుద
విఖ్యాత, సుకవిరాజశేఖర, రాజశేఖర
కవి ప్రణీతంబయిన సీతాపహ
రణం బను నాటకము.

సర్వమును సం
పూర్ణ
ము.

ప్రొద్దుటూరు శ్రీకన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

